శ్రీ

# ప్రహ్లాదనాటకము.

లేక

(దానవవధ)

బళ్ళారిజిల్లా బళ్ళారిడిస్ట్రిక్టు మునసఫ్‌కోర్టు వకీలుగా నుండిన

కీ. శే. కోలాచలం శ్రీనివాసరావుచే

రచియింపఁబడినది.

కే. శత్రుఘ్నరావుచేఁ

బ్రకటింపఁబడియె

మొదటికూర్పు.

స్టేట్ హైస్కూలు ప్రధానాంధ్రోపాధ్యాయులగు

పాకాల, ఆలూరు - వాసుదేవయ్యగారిచేఁ

బరిష్కరింపఁబడి

చెన్నపురి:

చంద్రా ముద్రాక్షర శాలయందు

ముద్రితము.

1920

*Registered Copy-right.*

వెల రు. 1—4—0.] [తపాలాఖర్చు అణా. 0—1—

గీ. కాస్యపసగోత్రజుడు తెలుగాణి ద్విజుడు
భాసురుండగు శ్రీసేతు పతిసుతుండు
కలడు కోలాచలాంచిత కులములోన
శ్రీనివాసుండు వితథీన మానసుండు

మహిత కోలాచలాన్వయ మల్లినాథ
సూరి వంశోద్భవుండయి భూరికీర్తి
ధరుఁడఁగానుండు శ్రీ శ్రీనివాస సుకవి
చేసె నీ నాటకంబును వాసి మీఱ.

# ఈనాటకమున వచ్చుపాత్రలు.

## పురుష పాత్రములు.

నారయణుఁడు
జయుఁడు
విజయుఁడు
సనక
సనందన
సూత్రధారుఁడు
హిరణ్యాకసిపుఁడు
విప్రజిత్తు
శంబరుఁడు
నారదుఁడు
ఇంద్రుఁడు
బ్రహ్మ
అగ్ని
యముఁడు
నైరృతి
వరుణుఁడు
వాయువు
కుబేరుఁడు
ఈశానుఁడు
బృహస్పత్యాచార్యులు
ప్రహ్లాదుఁడు
అశ్వినీదేవతలు
భూతపతి
చండుఁడు
అమాత్యుఁడు
బడిపిల్లలు
నృసింహుఁడు

## స్త్రీ పాత్రములు.

లక్ష్మీదేవి
లీలావతి
మంజువాణి
కృత్తి

షరా:—ఇందు రాక్షసులు, బడిపిల్లలు అనేకులు వారివారి అనుకూలముల కొలది రానగును.

# శ్రీనివాసకవి జీవితచరిత్ర.

ఎవ్వానివదన రాజీవరంగస్థలంబున నలువరాణి నిచ్చలును నట్టువలు నలుపుచుండునో! ఎవ్వాఁడు కువ్యాఖ్యావిష మూర్ఛితయగు కాళిదాస కవితాసుకన్యకను దనదు సంజీవినిచేఁ దెప్పిఱిల్లఁజేసి, వెజ్జులమిన్న యని వన్నె కెక్కెనో! ఏమహామహు దివ్యనామామృతమును వీనులారఁ గ్రోలని యతురాస్యుఁ డొక్కఁడైన నీభువిని గానంబడఁడో! ఏ మహితచారిత్రుని యశఃకుసుమంబుల ధరియించి దివాకర నిశాకరులు పుష్పవంతులను సార్థకనామమును బడసిరో!

ఏవిద్వద్వతంసుఁడు అనన్య జనసామాన్యమగు మహామహోపాధ్యాయ బిరుదమునకు మార్గదర్శియయ్యెనో! అట్టి చుళుకీకృత సకల శాస్త్రజలధియగు కోలాచల శ్రీమల్లినాథసూరి వంశమున మన శ్రీనివాసకవి ముక్తామణి విరూపాక్షక్షేత్రమునకు సమీపమునందుండు కామాలాపురమను గ్రామమున క్రీస్తుశకం 1854-3-13 తేదికి సరియగు ప్రమాదీచ సంవత్సర ఫాల్గుణాసిత చతుర్దశినాఁ డుద్భవించె. ఇతఁడు బాల్యముననే సంస్కృతభాషను జక్కఁగ నభ్యసించి, పిదప నాంగ్లేయభాషయం దసమాన వైదుష్యమును గడించి, కొంతకాలము రాజకీయోద్యోగిఁగ నుండి, తర్వాత న్యాయవాది పరీక్షలయం దుత్తీర్ణుఁడై, బలారిపుర వరమున న్యాయవాదిగ వఱలుచుండె. ఇతనికి నొకకూఁతురును, నలుగురు కుమారులును, గలరు. మఱియు నితఁడు 1917 సం॥ ఏప్రెల్ 7-వ తేది దేవాళీపురమున జరిగిన విద్వత్సభయని ప్రసిద్ధిఁగాంచిన యాంధ్ర సాహిత్య పరిషత్సభకగ్రాసనాధిపుఁడుగ నియమింపఁబడియుండె. ఇట్లుండ నేతత్కవిచంద్రుఁడు రాజవ్రణపీడితుఁడై యాంధ్ర కువలయంబు వసివాఁడగు కవిచక్రంబు లుల్లసిల్ల 1919 సం॥ జూన్ నెల 23-వ తేది యస్తమించె.

ఇట్లు విన్నవించు సుధీజనవిధేయుఁడు,

రావాడి వెంకటరామశాస్త్రి,

తెలుగుపండితుఁడు, మునిసిపల్ హైస్కూలు, బళ్లారి.



కోలాచలం శ్రీనివాసరావు.

# ఉపోద్ఘాతము.



(1) ఈనాటకము నావలన రచింపఁబడి దాదాపుగ నేడు వత్సరంబులయ్యెను. నాకుఁబొసఁగిన యనేక ననుకూలములు ముద్రింపించుటకు నంతరాయములుగ నిలిచెను. నేనీగ్రంథమును రచింపకమున్నే కీర్తిశేషులైన డి. కృష్ణమాచార్యుల వారీనాటకము వ్రాసి ప్రదర్శించియుండిరి. అందున ననేకపద్యములు పోతనగారి భాగవతమునుండి యెత్తబడియుండెను. ఒకానొకదినంబున వారితో నేను మాటలాడుచుండఁ బ్రస్తావవశమున భాగవతములోని పద్యములు మీగ్రంథములో దూర్చిన ఫలమేమియని ప్రశ్నించితిని. అంతట రసవంతములైన పద్యములు రచించుట కష్టమగు కారణమున, నేనా పద్యములు గ్రహించితినని వారనిరి. అందఱు నిటులనే యొనరించినచో, నిప్పటి కవుల కవితాభివృద్ధికిమార్గ ముండదనియును, పోతనగారి పద్యమును శ్రీముఖముగ నుంచుకొని దానిశైలి ననుసరించి, పద్య మల్లుచుండినచోఁ గొన్ని ప్రయత్నములమీఁద నైన నప్పద్యముల పోలిక పద్యములు కవులు వ్రాయ నలవడునని బదులిడితిని. పై ప్రసంగమే యీ నాటకము వ్రాయ నన్నుఁ బ్రేరేచెను. ఆశైలినిఁ బట్టి నేను పద్యములు వ్రాసితినిగాని, యంతటి రస ముప్పతిల జేయునంతటి శక్తి లేదయ్యెను. ఆచార్యులవారు సైతము నిటీవల తాము గొన్నిపద్యములు స్వయముగ రచించి నాటకములో జేర్చియున్నారు.

(2) ఈప్రహ్లాదచరిత్ర సృష్టి క్రమము ననుసరించినదియును, హారిదశావతారము లన్నియును, సృష్టిక్రమమునే తెలుపుననియును, నేనొక యుత్తర రంగమును ద్విపద రూపకముగ రచించినాను.

(3) ఈనాటకము వ్రాయఁ బ్రారంభ ప్రేరక విషయముపైఁ బ్రసంగమైనను, బలవద్బాధకమైన విషయము మఱియొకటి తటస్థించెను. సుమనోరమ సభవారెద్దియో యొక నాటకమును బ్రదర్శించుచు, "వచ్చునెల మూడవశనివారమున నాచే రచియింపఁబడిన ప్రహ్లాదనాటకమును బ్రదర్శింతు" మని ప్రేక్షకులకుఁ దెలిపి, పిదప విజయదశమీ రాత్రి నా సరసకువచ్చి, పైవార్తఁ దెలుపుచు, దమకా నాటకమును ద్వరలో వ్రాసియిండని వేఁడి యప్పుడే నాచే నాందీపద్యమును వ్రాయించిరి. దైవానుగ్రహమునఁ బదిదినంబులకే యీనాటకమును నే ముగించితిని. అప్పటిలో నుండిన వేషధారు,

లసహాయ శూరులై యుండినందున రేయింబవళ్ళు కష్టపడి పాఠములు నేర్చి తమపలుకు దక్కించుకొనిరి. పైరీతిగనే పై సభవారు "శిరోమణి నాటకము, కీచకవధ, శ్రీరామ జననము, లంకాదహనము" బలవంతముగ నాచే వ్రాయించిరి. ఆరీతిగ నన్నుఁ ప్రార్థించి ప్రోత్సాహపఱచి నాచేఁ బై నాటకములు రచింపఁ జేసినందులకు సంతసించుచున్నానుగాని, యత్యాతురముగ వ్రాసిన కతమున, నశుద్ధము లనేకములు పడినవో యేమో యను భీతిమాత్రము నను వదలలేదు. పండితులు నాయంతులు సహింపక నన్ను శిక్షించినను, పై సభవారు మాత్రము నన్ను దూఱరని నమ్మినాను.

(4) భక్తాగ్రణులలో శిరోమణి ప్రహ్లాదుఁడు కావున నట్టివాని నుండి వెడలు వాక్యములెల్ల వేదాంతసారముగ నుండవలెనని యెంచి యిటు లొనరించితి. హిరణ్యకశిపుఁడు ప్రహ్లాదునకు నిడిన యనేక విధములగు బాధలలోఁ బ్రదర్శించువారు తమకు ననుకూలములైనవి మాత్రము గ్రహింపనగును.

(5) ఈనాటక గ్రంథములో నే పాటలు వ్రాయఁబడియుండెను. కావున వాని నాయా విషయ సంబంధానుసారముగఁ జేర్చితిని. పాట పాడ నేరనివారు పద్యములు చెప్పనగును.

(౬) ఇందు వృత్తములు, గేయములు, పాటలని మూఁడువిధములగు గీతములుండును. అందు వృత్తములనఁగా ఛందశ్శాస్త్రవిధి విధానంబుగ యతి ప్రాస యుక్తములు. గేయములనఁగా యతిబద్ధములు గాని వృత్తములు. పాటలనఁగా యతి ప్రాస నియమములేకయు, గ్లిప్తాక్షర సంఖ్యాబద్ధము గానివియు నై యుండును.

సుజనవిధేయుఁడు,

కోలాచలం - శ్రీనివాసరావు.

10 6/19.



# కథాసంగ్రహము.

## ప్రథమాంకము.

1. రంగము—హిరణ్యకశిపుడు తన యమాత్యునితోను, నారదునితోడను ముచ్చటించుచుండ, హిరణ్యాక్షుని హరి వారాహరూపమునఁ జంపెనని రాక్షసులు తెలుపుదురు. హిరణ్యకశిపుఁడు హరినిఁ జంపెదనని వైకుంఠమునకుఁ బోవును.
2. రంగము—హిరణ్యకశిపుఁడు తాను బ్రహ్మనుగూర్చి తపం బొనర్చెదనని లీలావతికిఁ దెలిపి వెళ్లును.
3. రంగము—ఇంద్రుఁడు బలవంతముగ లీలావతి నీడ్చుకొనిపోవును.
4. రంగము—నారదుఁ డింద్రుని దూషించి లీలావతి చెఱ విడిపించి లీలావతినిం దన యాశ్రమంబున నుంచుకొనును.
5. రంగము—నారదుఁడు లీలావతికి హరి మహిమఁ దెలుపుచుండ లీలావతి నిదురించును. గర్భములోనుండిన బాలుఁడు నారదోపన్యాసమునకు నూకొట్టును.
6. రంగము—హిరణ్యకశిపుఁడు కోరినవరంబులు బ్రహ్మ యనుగ్రహించును.

## ద్వితీయాంకము.

1. రంగము—ఇంద్రుఁడు లీలావతిని నీడ్చుకొని పోవుచుండినవార్త నారదుఁడు హిరణ్యకశిపునకు దెలుపును.
2. రంగము—హిరణ్యకశిపుఁడు స్వర్గమును బ్రవేశించి యింద్రాది దిక్పాలురఁ జెఱఁబట్టును.
3. రంగము—ఉయ్యేలలో నిదురించు ప్రహ్లాదుఁడు శ్రీహరీయని కలవరింప హిరణ్యకశిపుఁడాగ్రహించును. లీలావతి దానికి సమాధానము చెప్పును.
4. రంగము—ప్రహ్లాదుఁడు హరినామస్మరణ సేయుచుఁ దండ్రినిఁ జేరఁ దండ్రి క్రోధించును. నారదుఁడు తగిన సమాధానము చెప్పును.
5. రంగము—ప్రహ్లాదుఁడు హరినామస్మరణ సేయుచుండ వానికి రోగమో పిచ్చియోయని, యశ్వినీ దేవతులను, భూతపతినిఁ బిలిపించి పరీక్ష సేయించుట.

## తృతీయాంకము.

1. రంగము—ప్రహ్లాదునకు విద్యాభ్యాసంబుఁ జేయింపఁ జండామార్కులు ప్రయత్నించుట.
2. రంగము—ప్రహ్లాదుని హరిభక్తికిఁ దండ్రి కోపగించి చక్కఁగ దండింపుఁడని గురువులకుఁ దెల్పును.
3. రంగము—ఉపాధ్యాయులు లేనపుడు బడిపిల్లకాయలకు ప్రహ్లాదుఁడు వేదాంతోపదేశం బొనర్చి హరిభక్తులఁ జేయుట.

4. రంగము—ఉపాధ్యాయుల మాటలు విని హిరణ్యకశిపుఁ డాగ్రహించి, కృత్తిచే వానినిఁ జంపుఁడని చండామార్కులకు నాజ్ఞ యిడుట.

5. రంగము—చండామార్కు లభిచార హోమమొనర్చి కృత్తి నుద్భవింపఁ జేయుదురు. కృత్తి ప్రహ్లాదునిఁ జంపఁ జాలక చండామార్కులను మ్రింగఁబోవ వారిని ప్రహ్లాదుఁడు రక్షించును.

6. కృత్తి నిష్ఫలమయ్యె ననిన చండామార్కుల మాటలువిని హిరణ్యకశిపుఁడు క్రోధించి వాని నితర విధముగఁ జంపఁ బ్రయత్నింప లీలావతి వానికి విద్య తానేర్పెదనని పిలిచికొని పోవును.

7. రంగము—హిరణ్యకశిపుఁడు ప్రహ్లాదునకు లీలావతిచే విషమిప్పించుట.

## చతుర్థాంకము.

1. రంగము—రాక్షసులు ప్రహ్లాదుని సముద్రములోఁ బడవైతురు.

2. రంగము—ప్రహ్లాదుని హరిస్తుతి కనకకశిపుఁడు వినఁజాలక పాములచేఁ గరపింపఁ నాజ్ఞయిడుట.

3. రంగము—ప్రహ్లాదుని హరిస్తుతి. గరుత్మంతుఁడు పామును దన్నికొనిపోవును.

4. రంగము—హిరణ్యకశ్యపుఁడు ప్రహ్లాదుని నగ్నిలోఁ బడవైచి కాల్చునటుల నాజ్ఞతిచ్చును.

5. రంగము—ప్రహ్లాదుని హరిస్తుతి వానవచ్చి మంట యారిపోవుట.

6. రంగము—హేమకశ్యపుఁడు ప్రహ్లాదుని మత్తగజములతోఁ ద్రొక్కింప నాజ్ఞయిడుట.

7. రంగము—ప్రహ్లాదుని హరిస్తుతి ఏనుఁగుక్రిందఁ బడిపోవుట.

## పంచమాంకము.

1. రంగము—హిరణ్యకశిపుని గర్వోద్ధతి. అష్టదిక్పాలుర నవమానించుట. హరిని జూపుమని ప్రహ్లాదుని బాధించుట. ప్రహ్లాదుఁడు తండ్రికిఁ జేసిన హరిమహిమ. నృసింహావతారము. ఆ దివ్యతేజమునుఁ జూచి, హిరణ్యకశిపుఁడు నిస్సత్వుఁడై పూర్వజన్మమెంచుక స్మరణకువచ్చి యెటులయినను హరిచేఁ జచ్చుటమేల పోట్లాడిచచ్చును. బ్రహ్మాదులును ప్రహ్లాదుఁడును హరిని స్తుతింతురు.

మంగళము.

## ఉత్తరరంగము.

ప్రహ్లాదనాటకములోని గూఢార్థ ప్రదీపకమగు ద్విపద.



శ్రీ

# ప్రహ్లాదనాటకము.

నాంది.

సూత్రధారుఁడు.

శ్రీలీలాకరపూత పోత్రియయి ధాత్రిన్ గొమ్మునందెత్తి
భూలోలాక్షిన్ సతిగానొనర్చి యతిబాలుండైన ప్రహ్లాదు
నే లీలామానుషసింహ విగ్రహుఁడు పాలించెన్ దయాశీలుఁడై
యాలక్ష్మీరమణుండు మీకు నిడు భాగ్యారోగ్య దీర్ఘాయువుల్.

అనుబంధము — 1.

పూర్వరంగము - వైకుంఠము.

మహాలక్ష్మితోడ పైఁ దలనుంచుకొని నారాయణుఁడు శయనించియుండు. ద్వారమున జయ విజయులను వారు గాచియుందురు. సనక సనందనులు.

(సనక సనందనుల ప్రవేశము)

సనక. వృత్త॥ జలధిశయానా జలజలోచనా జలజాలయ హృన్మోదనా
జలధినిధానా జలభవానన జలజాసన సంభావనా॥

సనంద॥ ఖలజనదానా ఖగసువాహనా ఖచరావళి సంజీవనా
కలరవగానా కలుషమోచనా కమనీయ కళాఖేలనా॥

జయ—విజయా! మన స్వామి హాయిగ నిదురించుచుండ వీ రెవరో దుడుకు బాలురు వచ్చి, లోదనే యేగుచున్నవారు, వీరి నివారించి పంపుదము.

విజయ—నిజము, వీరి సిగ్గులేని యాకార వికారముం జూచిన, మనస్వామి కోపగించుకొని మనల దండించును మనతల్లి మహాలక్ష్మి యిట్టివికారపు జంతువులను లోనికేలవిడిచితిరని మనల నాగ్రహించును. ద్వారికులగు మనము చేయఁదగినదనిఁ జేతము.

జయ—ఓరిబాలకులారా! మిమ్ము లోనెవరువిడిచిరి? ఇంతటి వికారపు రూపును వహించినవారు మహాస్వామిని న్మహాలక్ష్మినిఁ జూడ నెటు సాహసించితిరి? ఔరా, మీనైర్యము సాహసమెంత? దుడుకుతన మెంత?

సనక—సనందనా! సత్వరజస్తమో గుణాతీతుండగు దైవము సరసనుండినని ద్వారికులు, తామస గుణానుచరులై యాదేవుని దివ్య తమమైన మహిమఁ దెలియఁ జాలకయున్నవారు. సృష్ట్యాదియందు, దామస గుణాణువులు మిక్కుటముగ వీరి స్థూలశరీరమునఁ జేరినఁగున తదాచ్ఛాదనచే సూక్ష్మాంశముల మహిమ నెఱుంగరు. ఇంతటి మహిమాస్పదంబగు స్థళంబున వీ రుండఁదగినవారుకారు.

సనందన—నిజము.

గీ॥ వేపనూనె నొక్క బిందువు గొని రుచ్య
భక్ష్యమందు నిడినఁ బాయకుండు
వేము విషము గాదె? వీతసాత్వికులకు
సహజగుణము మానఁ జాలదెందు ॥

కావున వీ రచట నుండఁదగినవారు కారు. వీరిని శాపగ్రస్తులఁ జేయవలెను.

సనక—ఓరీ! మూఢులారా! వైకుంఠమున నుండియుఁ, మీరు విషము స్వభావము మానరయ్యె. ఘటములోని యాకాశముబలె దైవము సర్వాంతర్యామియై సర్వ సమదర్శనుఁడై సర్వజన హృదయాలయమునం దానంద మయత నుండునని తెలియక భగవత్పరిచర్యకు వచ్చిన వారి నీరీతి నివారించితిరి. కావున మీ రిచట నివసింప నర్హులుకారు కామక్రోధాద్యరి షడ్వర్గంబులకు లోఁబడి పాప స్వభావులరయి దేవద్విషులై రాక్షసరూపంబులు వహించి భూలోకమునం బడి యుండుఁడు.

(జయ విజయులు గడగడవడఁకుచు నమస్కరించి)

జయ. చ॥ వినయవిధేయతన్ దయను వేఁడెదమో యనఘాత్ములార! మీ
యనుపమ సత్వశక్తిఁ గననైతిమి మూర్ఖత హెచ్చి గర్వులై

విజయ॥ దనుజకులంబునం దెటుల తామసవృత్తి జనించువారమో
వినఁగన సహ్యమయ్యెడిఁ బవిత్రులఁ జేయుఁడిమమ్ము వేఁడుకన్॥

(అనుచు వారి చరణంబులపైఁ బడుదురు)

సనక—ఓరీ లెండు. బ్రాహ్మణవాక్యము రిత్త పోఁజాలదు కాన మాశాపం బమోఘంబు దీని కుపశమంబు సృష్టిస్థితిలయ కారణుం డగు లోకస్వామికి శక్తి కలదు కావున నాతి నావనుని వేఁడు.

(జయ విజయులు నారాయణునకు మ్రొక్కి)

జయ-ద్విపద. వందారుమందార వసుధాకళత్ర
బృందారకస్తుతి బృందచరిత్ర
బంధురభవపాశ బంధలవిత్ర
కంధరశ్యామల కమనీయగాత్ర
కందితిమయ్య శ్రీకాంత గోవింద
వందనంబులు లోకవంద్యముకుంద.

విజయ. ఇందిరా సుందరీ హృత్కంజమిత్ర
సుందర శుభకర సురుచిరగాత్ర
వందనంబులు నీకు వాసవవినుత
నిందితులై నిన్ను నెఱి వేఁడలేము.

జయ. సనక సనందను శాపించిరయ్య
దనుజులై యిలఁబుట్టి దళితాఘచరిత
శాపతప్తులమయి శాంతినిపీడి
పాపమాపునుగనఁ బడఁజాలమవని

గావ వేడీనులఁ గంజాక్షునీవు
ప్రోవవేవడి మమ్ము భువి నుండలేము.
(అనుచు నమస్కరింతురు)



మహాలక్ష్మి. అనుబంధము - 2.



నారాయణుఁడు(లేచి) జయవిజయులారా! మీయపచార కారణంబు సర్వము నే నెఱింగితి. ఈసనక సనందను లాకారమున బాలురైనను విజ్ఞానవృద్ధులు సత్యసంధులు వీరి వాక్యం బమోఘంబు మీరు దానవులై భువినిఁ బుట్టుట తప్పింప నాతరముగాదు. మీ రేఁడు జన్మంబు లెత్తి భూలోకంబున నన్నుం దలంపక యుంటకు సమ్మతియా? కాదేని నాకు ద్వేషులై నన్ను నిందించుచుఁ గొంచెము కాలమన, మూడుజన్మములు మాత్రము దానవులై, పిదప నాసన్నిధిఁ జేరుదురా? ఇందున మీ కెద్ది యుత్తమమని తోఁచునో దానిని వరంబుగఁ గోరుఁడీ.

జయ — దీనావనా!, పావనా! నారాయణా!

చ॥ మనఁగఁ బ్రయోజనంబె భువి మాధవ మీపదపద్మసేవ నె
మ్మనమునఁ జేయనొల్లక యమానుషవృత్తిని నేడుజన్మముల్
వనరుహలోచనా వసుధఁ బాపము రూపము లెత్తినట్లుఁగా
దన జత నందియుంచు మటి దారుణవృత్తిని మూఁడుజన్మముల్॥

విజయ — దేవా! దయాతిశేకంబునఁ దమ సేవానుసేవకులకు మఱియొక వరం బను గ్రహింపవలెను.

నారా — భక్తులారా! అదియేమి?

విజయ — ప్రతిజన్మంబునను మీచే మేము వధ్యులు గావలయును, మా యకసాన కాల మునం దైనను, దమ యవతార దివ్యరూపంబు మాకు గోచరింపవలయును. ఆయా జన్మముల మే మొనరించిన పాతకములు మము వెన్నంటిరాదు.

నారా — జయ విజయులారా! అటుల నే కానిండు. ఆదిజన్మంబున మీరు కశ్యపునకు దితిగర్భంబున జనింతురు. వెళ్లుఁడి భూలోకంబును జేరుఁడి. (జయవిజయులు నిష్క్రమింతురు)

(సనక సనందుల(గని) భక్తాగ్రేసరులారా! మీ దివ్యానుగ్రహంబున భూమిని నుద్భవించిన యజ్ఞానాంధకారంబు నశించి విజ్ఞానదీపంబు వెలుంగుచున్నది. సృష్ట్యాదిని సూక్ష్మాంశ జీవ మూలములు జేరినవి యెల్లను మూర్తీభవించి తమవంటి సాత్త్విక స్వరూపము లేర్పడెను. అటులనే స్థూలాంశము లేర్పడి కేవల తామస గుణ స్వరూపము లేర్పడెను. తమ్ముంబోలు వారు తామసాణువుల నంపు(జేసి జగత్తు సాత్త్వికాంశముల(దేజరిల్ల(జేయుట విధి కావున, మీరే జయ విజయుల మూలకముగ భూలోకజనుల యజ్ఞానంబు(దోలి దైవభక్తికి దారి(జూపువారైతిరి.

సనక సనందనులు—ఆర్య జనానురంజన కారుణ్యా! ఆశ్రితజనశరణ్యా! నీ చరణారవింద దర్శన లాభంబున నానంద తేజుల మైతిమి. ఆజ్ఞ యిడిన(బోయివత్తుము.

నారా—మంచిది, పోయిరండు.

నిష్క్రమణము.



## ప్రథమాంకము — ప్రథమరంగము.



[హిరణ్యకశిపుఁడు. విప్రజిత్తి. శంబరుఁడు. రాక్షసులు. నారదుఁడు.]

హిరణ్య—విప్రజిత్తి శంబరాది దితి వంశభూషణులారా! నేను సమస్తలోకంబులు సంచరించితిని. సమస్త దిక్పాలకుల(జెఱ(బట్టితి.

సీ॥ సర్వలోకంబులు సమయించునో యని
జడుఁడగు మృడుఁడు తాఁ జడియు నెపుడు
రక్షించు నెడనీఁడు పక్షపాతి యటంచు
శిక్షించునని భీతిఁ జెందు చక్రి
సురరాజుఁ జెఱఁబట్టి పరిమార్చు తఱివాఁడు
శరణన్న వదలితిఁ జంపకేను
దండధరుని కేలు దండంబు సడలింప
దండమం చడుగుల దండఁబడియె

గీ॥ భళిరె కాంచనకసిపుని బలమువినిన
చావునకు సిద్ధపడియున్న జీవికైన
గుండె ఝల్లను బ్రదికిన నుండవలదె
భూరిబల విక్రమంబులు భువిని నిటుల ?

అమాత్యవరులారా ! నాపటు విక్రమంబునుజూపి భుజకండూతి మాన్ప నా కెదురు పడువా రెవరునులేక యున్నారు. (రాక్షసులఁజూచి) రాక్షస వరులారా ! మీ రెచ్చ టెచ్చట సంచరించితిరి ? ఏమేమి పను లొనరించితిరి.)

విప్రజిత్తు—దానవ సార్వభౌమా !

సీ॥ దేవాయతనముల హేవాకముగఁ గూల్చి
దావాగ్నిని దహింపఁ దార్చినాను

శంబర. నిజవాసమునసుండు ద్విజదాసులను బట్టి
ద్విజహీనులుగఁ జేసి తెచ్చినాను

మాయావి. కుదురుగ మదినిల్పు మునితాపసులనోట
మదిరాసవముఁ బోసి కదిసినాను

ద్విజిహ్వ. పతిహిత వ్రతలగు సతులను జెఱఁబెట్టి
మితిలేని హింసల మెలపినాను

వడాశన. గీ॥ సురవరుండు గగన చరుఁడుగాఁ జనుచున్న
కనలినేను పట్టి కాలఁదన్నఁ
బుడమి పైనఁబడియె మిడకుచు వాఁడహో
నీదు భటుని బలము నెగడె భువిని.

హిరణ్యకసిపు—భటులారా ! మెచ్చితి మీబలఁబు హెచ్చెను మీకలిమి ఇదికదా యస్మత్కుల సత్కార్యంబు నేఁడు కృతార్థుఁడ నైతిని.

దౌవారి—(వచ్చి హిరణ్యకసిపు దేవా ! నారదుఁడు తమయానతి నిరీక్షించుచు ద్వారంబున చాలకాలమునుండి కాచియున్నాడు.

హిరణ్యా—ఆకలహాకారుని నిచటికి రమ్మనుము.

(ద్వారికుఁడు నిష్క్రమించి నారదునితోఁ బ్రవేశించును.)

నారదుఁడు వృత్తము.

దితికులపక్షా శ్రితజనరక్షా యతిబలదక్షా సేమమా?
జితసురనేతా నతజనదాతా యతికులత్రాతా భద్రమా?
రతిపతిరూపా వితతప్రతాపా సతతకలాపా క్షేమమా?
నతపరిపాలా నుతగుణశీలా హితజనజాలా సౌఖ్యమా?

హిరణ్యా—ఏమీ! నారదా! మునిజనులలో నీవొకఁడవు వివేకివి. నీకుఁ దారతమ్యజ్ఞానమున్నది. బలాబలంబు లెఱింగి నటింతువు, నారదా! భూలోకంబున వింత సమాచారంబు లెవ్వి యేని యుఁ గలవా?

నారదు—హిరణ్యకసిపూ! మఱేమియు లేవుగాని, నీసోదరుఁడు భూదేవి నపహరింపఁదలఁచి భూమిని జాపఁబోలెఁ జుట్టి పాతాళలోకంబునకుఁ బోవుచుండెను. భూదేవి శ్రీహరీ యని మొఱలిడ శ్రీహరివరాహావతారం బెత్తి భూదేవికి భయపడవలదని యభయం బిచ్చుచుఁ బాతాళము దూరెను.

హిరణ్యా—అచట నేమి జరిగినది తెలియునా?

నార—తెలియదు. మీ దర్శనమునకై యిచటికి వచ్చితిని.

హిరణ్యా—భూమినిఁ జాపఁగఁ జుట్టి నేర్చిన పటు పరాక్రమశాలియగు నా యన్నను నాకిటి గిటు లేమి సేయఁగలవు?

(భయపడి వడఁకుచు రాక్షసులు పరుగిడి ప్రవేశింతురు.)

హిరణ్యా—ఓరీ! రాక్షసులారా! ఏమి యిటుల పరుగిడి వచ్చితిరి? మీ కెవరినుండి యే యాపద సంభవిల్లెను?

రాక్ష—దేవా! ఎవఁడో హరియఁట పందియై మీయన్నతోఁ బోరాడి మీయన్నను జిత్రముగ వధించెను.

హిరణ్యా—ఏమీ! ఏమీ! ఒక పంది, పటు విక్రమాన్వితుఁడగు నాయన్న హిరణ్యాక్షునిఁ జంపెనా? ఆపంది యెచటనున్నది?

రాక్ష—పందిరూపమువదలి తనరూపము ధరించుకొని పక్షిమీఁద నెక్కిపోయెను.

హిరణ్య—(హా యని చింతించుచు)

మ॥ అకటా యెంతటి దుర్దినంబిదియహో హేమాక్షుండు నాసోదరుం
డకళంకోగ్ర పరాక్రమోర్జితుఁడు నిత్యారూఢ సత్త్వుండయో
వికలుండయ్యెనె యే కలంబునకు నిర్వీర్యుండునై చచ్చెనే
యిఁక సైరింపఁగఁజాల నాకిఁకగిరీ హింసింతు నెందాఁగినన్ ॥

సైపఁజాల సైపఁజాల విప్రజిత్తీ! లెమ్ము. నీవు కైలాసంబునకుఁబోయి రుద్రలోకం బెల్లను వెదకుము.) ఓరీ శంబరా! నీమాయలన్ని యుక్కెనపి బ్రహ్మలోకం బెల్ల వెదకుము. రాక్షసులారా! మీరు దిక్పాలకుల దేశంబులెల్ల శోధించి యాహరి యునికిఁ దెలిసిరండు నేనిపుడే వైకుంఠమునకుఁ జని యాహరి యెవఁడో వానిఁబట్టి తెచ్చెద వెళ్లుడి ఆలస్యమువలదు.

నిష్క్రమింతురు.

నారదుఁడు—ఈనిశాచరుఁడు కేవల తామసగుణానుచరుఁడుగనుండి నన్నుఁ జులకనఁ చూచి, నిలిచినవానినిఁ గూర్చుండుమని యైననుఁ జెప్పకపోయెను తుదకు దానీ తలను విడిచి పోవునపుడయినను ? నను బహుకరింపక పోయెను. వీఁడు హరిని వెదకునఁట. హరి వీనికి నగుపడ నిచేతఁ జిక్కునఁట ఔరా వీని గర్వము వీని యాయుః పరిమితికిఁ గాలంబా సన్నమగుచున్నది. వీఁడు పోయి వైకుంఠమున నేమి సేయునో యావినోదంబుఁ జూచెద ?

దితికులశిక్షా శ్రితజనరక్షా యతిబలదక్షా వేఁడెదన్
నుతసురనేతా నతజనధాతా యతికులత్రాతా పాడెదన్
రతిపతిరూపా వితతప్రతాపా సతతకలాపా యాఁడెదన్
నతపరిపాలా నుతగుణజాలా హితపరిపాలా కూడెదన్ ॥

(నిష్క్రమము)



## ద్వితీయరంగము.



[హిరణ్యకశిపుఁడు, లీలావతి, విప్రజిత్తి, శంబరుఁడు.]

విప్రజిత్తి — మావిభో! ఆ మాయావిహారి యెందుడాఁగెనో కదా?

సీ॥ మాయావిహారి తన - మందిరంబున లేదు
మున్నీరునన్ జొచ్చి - కన్న లేదు
ఆరామములఁ జేరి - యరయనందును లేదు
గుహలయందును వాని - గుఱుతు లేదు
నగములందునఁ జూడ - యగపడకున్నాఁడు
నాగలోకమునందు - నరయ లేదు
మునిజనాశ్రమములఁ - గనుఁగొనఁగా లేదు
దశదిశలెల్లను - దడవ లేదు

గీ॥ వహ్నిలోఁబడి కాలెనో - వనధిలోన
మునుఁగ జలచరములు వానిఁ - దినెనో జంతు
జాలముల నోటఁబడియెనో - చక్రిజాడ
నరసి వేసరి మరలితిఁ - బురముఁ జేర ॥

దితికులజనులారా! ఆ మాయల హరిని వెదకి వెదకి వేసారితి. ఏమి సేయుదును?

విప్రజిత్తి — దానవాగ్రణీ, నా సామర్థ్యమించుకయైనను దాఁపక నేను రుద్రలోకమంతయుఁ జలగడిగితిని ఎందును లేదు.

శంబరుఁడు — రాక్షసకులావతంసా! బ్రహ్మలోకం బంతయుఁ దిరిగి వాని జాడఁగానలేక నాకలవడిన మాయావిద్యలన్నియుఁ బెచ్చించి సర్వదిక్ప్రదేశగ్రాహి యగుచు ఛాయాయంత్రము నిర్మించి యందెల్ల వెదకితిని వ్యర్థమనోరథుఁడనైతిని.

గార — రాక్షసకుల భూషణులారా! ఆ హరి మునుల హృదయమునందునో, భూసుగులందునో, గోపులందునో దాఁగియుండునను శంక నామనమం దఁకురించినది

కావున, మీరీ దినమునుండి గోవిప్రముని జనుల నెందుఁ జూచినను వారినిబట్టి చంపుడి.

విప్రజిత్తి—దేవా! ఆహరి, తులసీ దళప్రియుఁడు కావున దులసీవనమున డాఁగి యుండెనేమో.

హిర—రాక్షసులారా! తులసీ వృక్షము లెచటనుండునో వానిని మూల ముట్టుకుగ వేరుతోఁ బెఱికివేయుఁడు.

లీలా—నాథా! నీకీ దేవద్వేషముపలదు.

శా॥ దేవద్వేషముమాను మా వలనదీ తీక్ష్ణంబు యోచింపుమా
గోవిప్రాదులు సాధుజీవులు ప్రియా క్రూరంబునన్ వారినిన్
నీవే లావధియింప నాజ్ఞ యిడెదో! నీరంబె యాహారమై
జీవింపన్ గనుమాని వారమును, హింసింపఁగ నేలా నృపా॥

మనోనాయక—నినుబోలు పరాక్రమశాలి, నోరులేని యనపరాధులను, నిరాహారులను, నిర్బంధింప నీ యశంబునకుఁ గుందు రాదా? సాధుజీవులందు డాఁగెనను హరి వారిఁ జంపినమాత్రమున నీకు దొరకునా? వలదీ సాధుహింస.

హిరణ్య—లీలావతీ! నీ వబలవు గావున భీరువుగ మాటలాడెదవు నన్నుఁబోలు ధీరునకు నీవు దారఁగ నుండఁదగిన దానవు కావు. నీవాఁడు దానవు కావున నీ మాటలు సైరించితిని. మఱియు నీ విప్పుడు గర్భము ధరించినావు. నీ మనము నొప్పింపఁజాలను. అంతఃపురము లోనికి వెడలి పొమ్ము.

(లీలావతి నిష్క్రమించును.)

అమాత్యవరులారా! ఇఁక నేఁ జేయఁబోవు యత్నంబు వినుఁడి. సమస్త సృష్టికర్తయగు విధాతను గుఱించి తపం బొనరించి యనన్య సామాన్యంబగు వరంబులందెద.

విప్రజిత్తి—దానవాగ్రణీ! నీవా రీతిఁ దపం బొనరించితివేని, నీయందు జనులు దుర్బలత్వం బారోపింతురు. భుజపరాక్రమ సంపూర్ణత్వంబు నీ కిపుడు లేదా? మఱి దేనిం గోరి తపం బొనర్తువు?

హిరణ్య—అమాత్యవరులారా! బ్రహ్మాదిత్రిమూర్తులును, భృగ్వాదిఋషివరులును, ఘోర తపం బొనరించి కదా మహాశక్తి సంపన్నులైరి? నేనును వారిరీతి బలం

ర్జించుటయ గాక వీరిలో నెవరినుండియుఁ జావులేనటుల వరం బంది పిదప వీరి నెల్లరిని నుఱ్ఱూఁత లూఁగించెద.

శంబర — దానవాగ్రణీ! ఇది మంచియుపాయము కానిండు.

హిరణ్య— అటులైన నేను హిమాచలంబుఁ జేరి ఘోర తపం బాచరించెద.

ఉ॥ నీరమున్ద్రావి ప్రాణమును నిల్పెడు మీనము లట్లుగాక యా
మారుత భక్షణంబునను మానుగ నుండెడు పాములట్లుగా
కారియుఁ బర్ణముల్ దినువిహంగము లట్లునుగాక నేనిరా
హారతనుండి నా యభిమతార్థముఁ గాంతుఁ దపంబుఁ బెంపునన్ ॥

(నిష్క్రమము.)



తృతీయ రంగము.



భవనము.

ఇంద్రుఁడు, లీలావతి, మంజువాణి.

మంజు— లీలావతీ! ఏలనమ్మా, ఈ లీలవ్యాకు లాధీన మానసవై కృశించుచున్నావు

కం॥ ఆపన్న సత్వయగుచును
నీపగిదిఁ గృశింపనేల యింతీ? నేమం
బేపారును నీమగనికిఁ
గాపాడుమ గర్భమీపు కందువ్వుశుభముల్ ॥

లీలావతీ— కలదీ యీాతేని పోని వెసనము. అడవినిఁ జేరి తప మొనరించిన వారెందఱు లేరు? వా రెవరయిన నకాలమరణంబున మృతినందిరా?

## అనుబంధము—3.

లీలావతీ—మంజువాణీ ! చెలీ, నిన్నటినుండి నామనంబునఁ గేలిడి కలఁచినటుల బాధలు గలిగినవి. నాదేహమెల్లను నవ శేమనముల కాలవాలమైనది. నాశరీరము నిలిచిన చోట నిలువదు. నిన్నరాత్రి పరుండియుండ నెవఁడో నా పైఁబడి కొప్పుఁబట్టి యీడ్చికొని పోయెను.

సీ॥ కలగంటినిన్న యో కంజాత నయనరో
క్రూరుఁ డెవ్వఁడొ నాదు కొప్పుఁబట్టి
వీథిని నీడ్చుచు వివిధాటవులఁ ద్రిప్పి
వదలెను నన్నొక వనిని నకట
ఆఁడుదిక్కెవరునుఁ జూడఁగ లేనట్టి
అడవిని నేఁగంటి బుడుత నొకని
నంతట మేల్కాని యంతటంజూచి వి
భ్రాంతనై మితిలేని వంతఁ గుంది

గీ॥ రాత్రిఁ గడపితినమ్మ రారాపునంది
యేమి సేయుదు ; నావిభు నెవ్వరేమి
సేసి బాధలఁ బెట్టిరో చెప్పనలవి
కాని కష్టంబుఁ గలిగెను గొంత మనకు ॥

అమ్మా! ఆ కలను దలఁచికొనినప్పు డంతయు వ్యాకులము బలమయి నిలువ బలములేక యీడిగలఁ బడుచున్నాను.

(లోనుండి గొప్ప ధ్వనియగును)

(ఇంద్రుని ప్రవేశము.)

అనుబంధము — 4.

ఇంద్రుఁడు—లీలావతీ ! నే నింద్రుఁడను.

లీలావతి—అయ్యా ! పురుషుఁడులేని తఱి నీవిటు లంతఃపురము చేర రానగునా ? నీతి కోవిదులు ఏ రీతిని మెత్తురా ?

ఇంద్రుఁడు. క॥ ఔనే లీలావతి మే
లౌనే యిటు మాటలాడ నౌనే నీకుఁ ?
గానీ లెమ్మా రమ్మా
మానమ్మున నాదుపురికి మానను నిన్నుఁ॥

లీలావతి—ధర్మాధర్మనీతులు నీనుండి తెలియుటకు నేనిచటికి వచ్చినవాఁడను కాను, నిన్ను నాపురికిఁ గొనిపోవ వచ్చినాఁడను.

అనుబంధము—5.

లీలావతి. సీ॥ వలదయ్య బావ యీ బలవంత మబలపై
చలమేల ఫలమేమి కలదు నీకు

ఇంద్రుఁడు. భామ యీనాఁడటే బావనైతిని నీకు
నౌనె యెంతటి మాయయతివ నీవు

లీలావతి. సురవరాగ్రణి పరతరుణు లుండినచోటఁ
జొరఁబాఱ నీకెంత సులభమయ్యె

ఇంద్రుఁడు. తరుణిరో నీపతి గురువయి కఱపిన
పరమ పాఠం బిది యరుల కెపుడు

లీలావతి. నీతియే ఖ్యాతియే రీతియే సురనాథ
సతుల నేచఁగఁ బరగతులుగలవె

ఇంద్రుఁడు. సతి నీవు పతికి నీ హితము నుపదేశింపఁ
జాలవైతివె యెంత జాణవీవు

లీలావతి. పతి యింటలేదని సతిఁ బట్టఁదగదురా
బలహాని కులహాని బావ నీకు

ఇంద్రుఁడు. తటిఁగాంచి పనిఁదీర్పఁ దగునను పెద్దల
వాక్యంబు వినవేమొ వనిత నీవు ?

లీలావతి. గీ॥ తరుణులను నేఁ చధర్మమే ? తగదు పొమ్మ

ఇంద్రుఁడు. జలజ నయనరొ వలదిఁక సరగ రమ్మ

లీలావతి. త్రిదశవర నీకుఁ దగదిది కదలి పొమ్మ

ఇంద్రుఁడు. లేమ ప్రొద్దాయె నిఁక నీవు లెమ్మ రమ్మ॥

(అనుచు సురపతి సమీపించును.)

లీలా. చ॥ సరసకు రాకు రాకు సురసత్తమ సారస నేత్రలల్గినన్
సరసత నింకిపోవు విరసత్వముఁ జేకుఱు మీఁద హానియున్
బరిభవమున్ నిజంబుగను బ్రాప్తిలుఁగావునఁ డెందమందునీ
వరయుము దుర్బలాంగ ననునంటకుమాకనుమాయశంబునన్॥

సురవరా — పరనారుల సరసఁజేరి పరిభవింప యత్నించుటకా నీవొనరించిన శతయాగముల ఫలము ? నేఁ బతివ్రతను నన్నంటకు.

ఇంద్రు, క॥ లీలావతి లీలావతి
యేలా యిటునీవు సంశయింతువొ నన్నున్
లోలాక్షి కొంతకాలము
పాలించుచుఁ బిదప నిన్ను బంపుదుఁ బురికిన్.

లీలావతీ — ఏల నీవు నాగుణము సందేహించుచున్నావు. నిన్నుఁ గొనిపోయి, నామందిరమున నుంచుకొని కొంతకాలఁబు రక్షింప యత్నించినాను.

లీలా — త్రిదశవరా ! నీ సదుద్దేశము హితమై కన్పట్టినను నీకేల యేనాఁడును కానని కరుణ యీనాఁడు కలిగెనో తెలియకున్నాను, నన్నుఁ గొనిపోవు కారణం బేమి ?

ఇంద్రు — లీలావతీ ! నీవు గర్భము ధరించితివి.

లీలా—నిజము సంపూర్ణ గర్భవతి గావున నన్ను బాధించుట యనుచితము.

ఇంద్రు—లీలావతీ! నీవు ప్రసవించునఱకు నామందిరమున సుఖమున నుంచుకొని నీవు పుత్రినిఁ గంటివేని, తల్లీపిల్లలను మరలఁ బంపెద. ఒకవేళ బుత్రునిఁ గంటి వేని సంహరించి నిన్నుఁ బంపెద.

## అనుబంధము—6.

లీలా—(కోపమున) ఛీ! సురాధమా ఇదియా నీదురుద్దేశము? ఓరీ, ఇంద్రా శిశు హంతా, గర్భస్థుఁడగు బాలునిఁ జంపఁ దలఁచితివా? ఓరీ! బాలఘాతుకా, ఈకోల వహ్నిజ్వాలలఁ బలె నిన్నింటి కాల్చుటయ కాక నీకులము నెల్ల గాల్చునుసుమా. దురాత్మా, అకృతాపరాధుని నిఁకను వెలివడని బాలునిఁ జంపు ద్రోహబుద్ధి నీకేల కలిగె? నీకు వినాశ కాలంబు సమీపించినది.

ఇంద్ర—(కోపము) జగరాగా! నీ శాపోక్తులకు నే జడియువాఁడను గాను ఊరక నే నుండినంత కాలము నీ వీరీతి నన్ను శపియించుచుందువు కావున నిదిగో నీ కొప్పుఁబట్టి యీడ్చుకొని పోయెద.

(అనుఁ గొప్పుఁబట్టి యీడ్చుకొని పోవుచుండును.)

లీలావతి. సీ॥ దైత్య వంశాబ్ధి చంద్రమ నీదె దారను
బాలింపుమా వీని బాధనుండి
విప్రజితీ తాళ విబుధుని బాధలు
తప్పించరా నిన్నుఁ దలఁచుదాన
శంబరా యిటుల విలంబము సేయకు
శంబరు బాటి నే సైఁపఁజాల
శకుని యీపాతకి శాసింప రావేల
జాగు సేయుఁగఁ దాళఁజాల నేను

గీ॥ విక్రమాన్యులు దైత్యులు వేలకొలఁది
నుండియును నాకు లేరైరి దండితాగి
వైరి ప్రాణాపహారి నాపతినిఁ జేరి
దారదుఃఖంబుఁ దెలిపెడువారు లేరు.

ఇంద్రు—లీలావతీ! నీ మొఱ వినువారెవరును లేరు వెళ్లుము.

(నిష్క్రమణము.)



చతుర్థరంగము.



అరణ్యమార్గము.

[ఇంద్రుఁడు, లీలావతి కొప్పుం బట్టి యీడ్చికొని పోవుచుండును.]

లీలావతి. సీ॥ సురరాజునకుఁ జిక్కి స్రుక్కితి గిరులార
నరునకుఁ దెలుపుఁడీ వార్త మీరు
అసుర విద్వేషి నన్నపహరించెను నాదు
భర్తకుఁ దెలుపుఁడు పక్షులార
విబుధేశుబాధలు విభునకుఁ దెలుపుఁడో
హరులార వేఁడెద ననుదినంబు
దేవేంద్రుబాధలు దితికులాధిపునకు
నెఱిఁగింపుఁ డోర్మిమై నఱచి జనులు.

గీ॥ ఘనతపశ్శక్తి కలిగిన మునివరేణ్యు
లార రక్షింపరే నన్ను గారవించి
కూఁతురుగఁ జూచి మించిన కూర్మిఁ బెంచి
నీనిబాధలు తొలఁగించి వేడ్కనించి?

నారదులు ప్రవేశము

అనుబంధము — 7.

దితికులశిక్షా శ్రితజనరక్షా యతిబలపక్షా మాధవా
నుతసురనేతా నతజనదాతా యతికులత్రాతా కేశవా
రతిపతిరూపా హితతప్రతాపా సతతకలాపా శ్రీహరీ
నతపరిపాలా నుతగుణజాలా హితపరిపాలా శ్రీహరీ.

(ఇంద్రుఁడు నారదులనుఁ జూచి)

ఇంద్రుఁడు—నారదా! జ్ఞానవిశారదా, మీ పాదారవిందములకు విభుదేంద్రుఁ డభివందనంబు లాచరించు చున్నవాఁడు.

నారదు—స్థిర సౌభాగ్య సమృద్ధిరస్తు (లీలావతినిఁ జూచి యింద్రుని గురించి) అమరేంద్రా! ఈసుందరి యెవరు?

ఇంద్ర—దేవా! హిరణ్యకశిపుని భార్య.

నారదు—హా, హా, ఆ పతివ్రతా శిరోమణియగు లీలావతియా యీ శుద్ధచరిత్ర. ఆ హిరణ్యకశిపుని నీవు రణరంగమున నోడించి చంపితివా?

ఇంద్రు—నారదా? నాకంతటి కష్టము నిక్యాక యుగ్రతపం బొనరించుచుఁ దప్పుఁడై వాఁడు మరణమునందెను.

లీలావతి—(హా, యని నిట్టూర్పులు సారించుచు నేలపైఁ బడును.)

నారదు—వానిమరణము, నీకు నెవరు వినిపించిరి?

ఇంద్రు—దేవర్షీ! తపో విఘ్నంబునకై రంభోర్వశులనేఁ బంపియుండ వారు చని వాని మరణోదంతము దెచ్చిరి.

అనుబంధము—8.

నారదు—అమరవరా! నీకు వినాశకాలము ప్రాప్తిల్లెను కావున నిట్టి విపరీత బుద్ధి బుట్టినది వివేకము మాసిపోయినది.

ఇంద్రు—నారదా! ఇంతగ నన్ను దూషించెదవేల?

నారదా—సురవరా! ఘోరతపం బొనరించువా రకారణంబున మృతులగుదురని నీ వెచటనైనను గన్నావా, విన్నావా? ఆ కాశ్యపుఁ డుగ్రతపం బొనరించి యింతలోనే బ్రహ్మచే దివ్యవరంబులంది నిన్నుఁ బదచ్యుతుగా నొనర్చి సంతసించుచును నీవీ ప్రతివ్రతా శిరోమణిని నంటిన కారణంబున నాపదల్లు నీకు బలమై బాధించును.

సీ॥ పతిహిత వ్రతయగు సతిని నిర్బంధించు
మతమేమిరా యింద్ర మాన్యమేగ
భర్తయె దైవము ప్రాణం బనుచు నమ్ము
భామను బట్టుట భావ్యమేర
పరమ పతివ్రతా భరణమౌ చెలినంటి
మేలగు యశమెల్లఁ గాలదేర
నిందు చూలాలిని నిరపాయ కర్మను
నేఁచినఁ గులమెల్ల నేర్చు గదర

గీ॥ రాజ రాజువయ్యు రాజిత యశుఁడయ్యు
నాతి నుంప నీకు ఖ్యాతియేర
నీదు విభవమెల్ల నీతగుఁ దెలియరా
చేటుఁగలుగు నాదు మాట వినర॥

(లీలావతి లేచి కూర్చుండును.)

ఇంద్రు. ఉ॥ నారద నీ పదంబులను నమ్మిచు నిక్కముఁ దెల్పువాఁడ నీ
నారిని దుర్మతంబునను నాఁచిన వాఁడనుగాను నమ్ము మీ
వారిజ నేత్రగర్భమున వర్ధిల్లు దైత్యకులాంకురంబునున్
ధారుణిఁ బుట్టినంతఁ బవిధారను గుత్తుకఁ ద్రుంప నెంచితిన్॥

జ్ఞానవిశారదా— నే నింతకంటెను హెచ్చేమియుఁ జేయఁదలంచిన వాఁడను కాను.

నారదుఁడు—అమరవరా! నీవు విమోహవారధిలోఁ బడి పొర్లుచున్నావు. ఆ వారిజ నేత్ర గర్భమున నవ్వారిజ లోచనుని భక్తాగ్రేసరుఁడు సుతుఁడు పుట్టఁబోవు

చున్నాఁడు. వాఁడు నీవజ్రధారచే హతుఁడు కాఁడు నీచే హతుఁడుగాఁడు; వహ్నిచే దహింపఁబడఁడు. యముని దండమునకు లోఁబడఁడు. నైరృతి కుంతమునకు వశుఁ జెందఁడు వరుణుని పాశమునఁ గట్టుబడఁడు. వాయువు ధ్వజమెత్తినను వానిని జయింపఁడు, కుబేరుని ఖడ్గము వాని ఖండింపదు. ఈశానుని త్రిశూలమైనను వాని జోలి పోనేరదు. నీఁ జంపెదనను దురహంకారము నీకేల కలిగెను? ఈ పురంధ్రీమణిని నీవు నా సరసవదలి యమరావతిఁ జేరుము. నీకు విపత్తులు గలిగినను నీబాలుని పావన చరిత్ర నిన్నుఁ గాపాడును.

ఇంద్రుఁడు—మునికులతిలకా! భవద్వాక్యామృతము గ్రోలి సంతసించితిని. ఈసతిని నీ సరసనుంచి పోయెద.

(లీలావతినిఁ జూచి.)

కం॥ సతి నా యపరాధంబును
మతినుంచక బ్రోవుమమ్మ మానిని వేడ్కన్
హితముపదేశింపుము నీ
పతికిని మముఁ బ్రోవ లాగు మానిత చరితా॥

(అనుచు నారదునకు నమస్కరించి నిష్క్రమించును.)

నారదుఁడు—(లీలావతిఁ జూచి) సాధ్వీమణీ! లీలావతి! ఊఱడిల్లుము. నీభర్త క్షేమంబున నున్నవాఁడు. కొంతకాలములోనే విధాతచే వరంబు లంది వచ్చును. అందాక నీవు నాయాశ్రమమున నుండుము. నీకు క్షేమం బొనగూడును రమ్ము.

లీలా—దేవముని! తమ యమోఘాశీర్వాదఫలం బందినే సుఖంబున నుండెద.

(నిష్క్రమము.)



## పంచమరంగము.

### మునియాశ్రమము.

[లీలావతి, నారదుఁడు.]

నారదుఁడు.—లీలావతీ! మనుజుఁడు ధర్మార్థ కామమోక్షములను చతుర్విధ పురుషార్థములలో నెద్దియేని, నెవ్వియేనిఁ గోరినచో నవి శ్రీహరి చరణారవింద సేవనంబున ఫలించును గాని నితర విధంబున ఫలింపవు. శ్రీహరి యనుగ్రహంబు లేకున్న, నే ప్రయత్నములు ఫల కారణంబులు గావు. శ్రీహరి పురుషరూపమునఁ దానొక్కరుం డయ్యును, తనచేఁ గల్పింపఁబడిన మాయను బ్రోఁబడిన వానిం బలె నటించుచుఁ దన్నటనకై యనేకవిధములగు లీలావతారంబులు ధరించి, యజ్ఞానుల విమోహ పాశంబుఁ బడవైచుచు, విజ్ఞానులను జన్మజరామృత్యువుల నుండి తరింపఁజేయుచు, లీలావినోద రూపమున భాసిల్లుచుండు. ఆ పరమపురుషుని తేజోమయ రూపం బపరిమిత సూక్ష్మాణువులై మాయానుయ శరీర ధారుల సర్వులఁజేరి నీవార శూకాకృతి వారి హృదయములందు నుండును. విజ్ఞానాత్మకులఁ జేరిన తేజోమయాణువు స్వచ్ఛతర ముకురంబునఁ ప్రతిబింబించిన ప్రతిమవలెఁ దేజరిల్లుచుండు. జ్ఞానాత్మకమైన శారీర భాండమునఁ జేరిన సూక్ష్మాణువు తేజరిల్లక లోపలనే యడఁగి యుండును ఘటములోని యాకాశము తద్ఘటవియోగమున నాకాశ తత్వములోఁజేరి పోయినరీతిఁ దేజోమయాంశము శారీర వియోగమున మరలఁ దేజోమయ రూపమును జేరిపోవును. మృద్భాండములోని దీపకళిక వెలుగియ్య జాలనిరీతి నరిషడ్వర్గ సాంబంధిక తామస గుణమను మృత్తికచే దట్టముగ మెత్తఁ బడిన శరీరధారి హృదయాంతరమునఁ దేజోమయాంశ ముండినను నది ప్రజ్వలింపక యుండును. కావున శారీరధారి శ్రీహర్యర్పణముగ స్నాన జప తపాది కర్మలచేత శరీరమునుఁ దపింపఁజేసి యంతర్యామియగు తేజము భాసిల్లులాగున శుద్ధి పఱచవలెను. పర్వతంబున దొరకిన బంగార మనేక కాకలచే స్వచ్ఛమగురీతి హరినామ స్మరణ హరిపూజ మొదలగు కర్మలచేఁ జిత్తశుద్ధిగలిగి హరి తేజంబు ప్రజ్వరిల్లుచుండును. అహంకార మమకారములకుఁ జిక్కి తన్ను తానెఱుంగక నేను నీవు వాఁడను భేదబుద్ధిగలవాఁడు కేవల పశుకయి తిన్నందన యజ్ఞానమయ స్థూలా

టావుల శుద్ధిఁ బొందక భిన్నించు కాలమున జడత్వముఁ దాల్చి పునస్సంధాన కాలమున పూర్వజన్మ సంబంధ సంయోగ వాసనా బలంబున తజ్జ్ఞానాంశము లేకయే మరల నజ్ఞానమయ శరీరమే ధరించును. ఏమి లీలావతీ! నిదురపట్టెనా యేమి? వేదాంతమనిన నందఱికి నిదుర వచ్చుచుండును. లీలావతీ! మాటలాడవు. ఇదివఱకు నా యుపదేశమునకు "ఊ" కొట్టుచున్న వారెవరు (సమీపించి) భక్త్యాదియోగ సాధనలచే, శరీరధారి విజ్ఞానాగ్నిచే నెల్లకాలంబు స్థూలాంశగత మలినమును గాల్పఁడేని నట్టివాఁడు మరల మరల నెన్నెన్నియో జన్మము లెత్తుచుండును (ఊఁ యను స్వరము లోనుండి వచ్చును) హా! హా! ఇదియేమి చిత్రము? గర్భములో నున్న బాలుఁ డేరీతి నా వేదాంతోపన్యాసమాలకించి "ఊ" కొట్టుచున్నవాఁడు! వీఁడు వైష్ణవ భక్తాగ్రేసరుఁ డగుననుటె నిస్సందేహము కానిమ్ము. మనుజులు సర్వప్రకారముల సర్వదేశములందును, సర్వకాలము లందును హరికథా శ్రవణంబును, హరినామ కీర్తనంబును, హరిస్మరణంబును హరిపూజయుఁ జేయుట కర్తవ్యంబు అటుచేయక యుండువాఁడు మని యుండినను, జచ్చినవానితోఁ జెప్పఁదగినవాఁడు గోవింద నామామృతము! వీనులారఁ గ్రోలనొల్లనివాఁడు సూకర సమానుఁడు. హరిచరిత్రలు విననివాని కర్ణపుటములు నట్టి బిలంబులు. అప్పరమాత్ముని నుతింపని నాలుక కప్పనాలుక. హరి పరిచర్యచేయనో పని చేతులు పీనుఁగుచేతులు నారాయణుని దివ్య విగ్రహముఁ జూడని కన్నులు నెమలిపురి కన్నులు.

(లీలావతి నిద్ర లేచి)

లీలా—తండ్రీ! నీ యుపదేశంబు వినుచుండిన నాకు నేఁ డేలొకో పట్టలేని నిదుర పట్టెను. ఇపుడు మేల్కాంచితి. నా శరీరమేమో యొకవిధముగ నున్నది. నే లోనికిఁ బోయెద. (నిష్క్రమించును.)

నారదు—ఈపతివ్రతా శిరోమణి, ప్రసవవేదన ననుభవించులాగ గనఁబడు. హరిభక్తాగ్రేసరుఁ డిపుడే జనించును. తిథివార నక్షత్రాదు లన్నియు శోభన కరములైనవి నేనునుఁ బోయెద.



## షష్టమరంగము.

ఆరణ్యము.

హిరణ్యకసిపుఁడు, బ్రహ్మ.

అనుబంధము—9.

అనుబంధము—10.

బ్రహ్మ. కం॥ లెమ్మా హిరణ్యకసిపూ
యిమ్మాడ్కిం దపముసేయ నితరులవశమే
కొమ్మా కామితములకు వ
రమ్ముగ నొసఁగెదను నీకు రమ్మా వేడ్కన్॥

ఓహో! హిరణ్యకసిపూ! లోకవిద్రావణ కరం బగు నీదారుణ కర్మంబు చాలింపుము. నీఘోరతర తపోవహ్నిజ్వాలలు రోదసీ కుహరంబునిండి ప్రాణకోటిని పంచత్వంబు నొందించుచున్నది. నీతపంబు చాలింపుము లెమ్ము. నీకామితార్థంబు లొసంగ నేనిపుడు నీకుఁ బ్రత్యక్షుఁడ నైతిని.

(హిరణ్యకసిపుఁడు సమాధి యోగంబువదలి లేచి బ్రహ్మనుఁజూచి)

హిరణ్య. సీ॥ త్య్రక్షర సంయుత తత్వాంతరస్థుఁడై
ప్రాపంచకము నిండు బ్రహ్మవీవ
ప్రథమ వర్గాక్షర ప్రథముఁడై విలసిల్లి
జగతిని సృష్టించు స్రష్టవీవ
ప్రణవాభిమందిర ప్రాసాదఖేలన
పరుఁడవై భాసిల్లు గురుఁడ వీవ
సత్వరజస్తమ స్సంగతి నేకమై
యొకపరి భిన్నమై యొప్పుదీవ

గీ॥ దైవములలోన బ్రహ్మముఖ్య దైవమీవ
నిగమ నిలయానురక్తుఁడై నెగడు దేవ
యవ్యయానంద రూపుఁడ వగుదువీవ
యీప్సితార్థప్రదాతవౌ యాగుఁ దేవ ॥

అహో మహిమా! నీ మహిమను నెఱుంగ మముఁబోలువారికి శక్యం బెటులగును? దేవా! ఆత్మను మానస బుద్ధీంద్రియ వికారముల జీకాకుఁబఱచి తన్నివారణకై బహువిధ కర్మంబులు నియోగించి సంపద్దారిద్ర్యములు సుఖ దుఃఖంబులు జనన జరా మరణంబులు దానివెంటనె కల్పించి యివి యన్నిటికిని సాక్షీభూతుఁడవుగ నిలిచిన దైవంబవు నీవు కావా? తాతా! సమస్త చరాచరకోటి నిన్ననవరతంబు ప్రస్తుతించుచుండును గదా? భక్తలోక కామధేనువు నీవని కాదా సార్వకాలములందు సర్వులు నిన్నుఁ బూజించుచుందురు? సకల ప్రపంచంబునకు శాంతిఁ గలిగించుచు నాశ్రిత పారిజాతంబు నీవని కాదా నిఖిలజనులు నిన్నెల్లప్పుడు దలంచుచుందురు. ప్రణత చింతామణివి నీవని కాదే సమస్త ప్రాణికోటి రక్షణార్థంబు నిన్నారాధించుచుండును? దాతృత్వ గరిమచే దాస సమీప మేరువు నీవని కాదా భక్తులు సదా కాలంబు నిన్ను హృదయంబున నిలిపి ధ్యానించుచుందురు. వాణీ రమణీ ప్రాణనాయకా. సమస్త కామిత ప్రదాత విధాత నీవని మదినెంచి త్రయీ విదితుఁడగు నీకు వందనంబు లర్పించెద. (అనుచు సాష్టాంగ దండప్రణామంబు లాచరించును.)

బ్రహ్మ—వత్సా! హిరణ్యకసిపూ! వినయంబు నే మెచ్చితి లెమ్ము నీ కామితంబులు సమకూర్చెద వేఁడుము.

హిరణ్య—పరమేష్ఠీ! నన్ననుగ్రహింతువేని నా వేఁడు వరమ్ము లిమ్ము.

సీ॥ నరసురాసుర యక్ష గరుడ గంధర్వ కి
న్నర సిద్ధసాధ్య పన్నగ పిశాచ
భూత రుద్రాదిత్య ప్రేత విద్యాధర
చారణ నైరృతి జాతవేద
యమ వరుణేశాన యమి ధనదా నిల
గజ గండభేరుండ గవయఖడ్గ

సారంగ శార్దూలశల్య కంఠీరవ
మార్జాల మర్కటి మహిష కిటులు
పగలు రేలును నిల్లు బాహ్యాంత రిక్షముల్
నార్ద్ర శుష్కంబులు నబ్ధులవని

గీ॥ భల్లభిల్లీలు లాయక భల్లుకములు
అచర చరములు భూరి శస్త్రాస్త్రములును
చక్రి చక్రంబు నీవును శర్వాశూల
మెల్ల నన్నంటఁ బోల్లయి చెల్లుఁగాత ॥

పితామహా! మునిశాపంబులు నన్నంట భీతిలవలెను.

బ్రహ్మ—వత్సా! నీకోరిన వరంబు లొసఁగితి.

హిరణ్య—దేవా! నాకోరఁదగిన వరంబులఁ కనుఁగొని యున్నవి.

బ్రహ్మ—వత్సా వేడుము.

హిరణ్య—తాతా! నీచే సృజింపఁబడిన యేవస్తువు నన్నింటి వెఱవవలెను.

బ్రహ్మ—అటు లగుఁగాత!

హిరణ్య—ఇంద్రుని ఖరాయుధ భేద్యము కానటుల నాతను వుండవలెను.

బ్రహ్మ—(యోచించి తలయూఁచి) నఖిరాయుధ భేద్యుఁడవుగ నుండుము.

హిరణ్య—(సంతసించి.)

శా॥ వంతల్బాసెను మానసంబునను నో వాణీ మనోనాయకా
సంతోషించితి మీపదాబ్జముల సాష్టాంగ ప్రణామంబు ల
ర్పింతుం జిత్తము నన్దలంతు నిను భావింతుర్ సదాకాలముర్
శాంతాకార నిరంతరాగమ సరస్సంచార క్షేమంకరా ॥

(నమస్కరించి) తాతా! నీవరంబుల మోఘంబులు కదా!

బహ్మ—దానికి సందియంబేమి.

హిరణ్య—నిజమా?

బ్రహ్మ—నిజము నిజము. ముమ్మాటికి నిజము.

హిరణ్య—అటులయిన నీవు నా యాజ్ఞాధారకుఁడవై యుండవలయును గదా?

బ్రహ్మ—(వెఱగంది) నిజము. నీ యాజ్ఞాధారకుఁడ నేను.

హిరణ్య—అట్లైన నీ విపుడవెళ్లి సర్వప్రపంచముఁ గ్రుమ్మరి, యింతటినుండి ప్రపంచమున దైవము హిరణ్యకసిపుఁ డనియు, నన్యదైవము లేఁడనియును యజ్ఞయాగాదులు నా ప్రీత్యర్థంబు సేయవలయు ననియుం బ్రకటింపుము. తెలిసినదా?

బ్రహ్మ—దేవా! అటులనే యొనరించెద.

హిరణ్య—నేఁ బోయివచ్చెద.

## అనుబంధము—11.

(నిష్క్రమము.)

బ్రహ్మ—హా! హా! వీఁడెన్ని క్రూరమగు వరమ్ములు వేఁడెను. వీని దారుణతపంబునకు మెచ్చి వాఁ డడిగిన వరమ్ములన్నియు నొసంగితి ఎంతకును దృప్తినందక వాఁడు వరములు వేఁడినది చూచి వేసరి యంత్య వర మొసఁగునపుడు శ్లేషార్థవాక్య మాకస్మికముగ నా వాణి పలికించెను. ఇంద్రుని ఖరాయుధమునఁ దనువు భేద్యము గాకుండునటుల గదా వాఁడు వేఁడెను. ఖరాయుధమున భేద్యుఁడవు కావని పలుకుచో, నఖరాయుధ భేద్యుఁడవని పలికితి. నావచనంబమోఘంబు కావున వీఁడు గోళ్లచేఁ జచ్చును కానిమ్ము. కొంతకాలము వీని బాధ సైఁచికొని యుండవలయును నేను వాఁ డడిగినయాజ్ఞ నెఱవేర్పవలెను.

(నిష్క్రమము.)



శ్రీ

# ప్రహ్లాదనాటకము.

## ద్వితీయాంకము — ప్రథమరంగము.

### అరణ్యమార్గము.

[హిరణ్యకసిపుఁడు-నారదుఁడు.]

అనుబంధము—12.

ఇప్పుడుగదా నాడెందం బమందానంద జలనిధిలో నోలలాడుచున్నయది. భోగైశ్వర్య విభవంబుల విఱ్ఱవీఁగుచు నిక్కి నీల్గుచు దనుజకులంబునకు నాజన్మ ద్వేషియయిన దేవేంద్రునిఁ బదభ్రష్టునిఁ జేయునందాఁక నాకంటికి నిదురపట్టదు. అష్టదిక్పాలురయా హైశ్వర్యంబుల నాఁచికొని వారిని నాపద దాసులుగ నుంచుకొని యుండెద నన్ను దైవమని నుతింపని తాపసుల రూపు మాపెద.

కం॥ కిటగిటి యిటురానిమ్మా
చటుల పరాక్రమముఁ జూపి చంపుదు వానిన్
మటుమాయలహరి గిరి రా
నిటువచ్చినఁ బట్టి బలిగ నిత్తును భువికిన్॥

(నారదుఁడు ప్రవేశము)

పంచచామరము॥ దినాధినాథ దివ్యతేజ దీనలోకపోషణా
యనాదిదేవదేవ పీన యాన దాసతోషణా
యనూనపూజ నీయదేహ యాగమైక భూషణా
సనాతనాభి ధర్మశీల చారుసత్య భాషణా॥

హిరణ్య—ఏమి నారదా! నీవు నన్నుఁ జూడలేదా.

నారద—ఇపుడే చూచితిని.

హిరణ్య—దేవుఁడని నాకు నమస్కరింప నేల ?

నారద—నీవు దేవుఁ డనునది నాకుఁ దెలియదు.

హిరణ్య—నేను దేవుఁడ నైతిని. ఇఁక ముందు నేనే ప్రపంచంబున దైవమని సకలురకుఁ దెలిపిరమ్ము. త్రిమూర్తులు నావశులైరి.

నార—త్రిమూర్తు లెవరు ? ఇపు డుండునది ద్విమూర్తులుగదా. మూడవమూర్తి నీబారికి వెఱచి వెలికి వెడలక యెందో డాఁగినాఁడు.

హిర—నిజము. నారదా నిజము పలికితివి. వాఁ డెందుండును ?

అనుబంధము—13.

నార—హరి మాయావి అనేక రూపము లెత్తఁగలఁడు. నాఁడు నీవు వైకుంఠమున నన్వేషించునపుడు సూక్ష్మరూపముగొని నీ హృదయముననే, చేరినాఁడని నే ననుమానించెద.

హిరణ్య—అటులైన నాయింటఁ జిక్కిన వాఁడాయెను. ఇఁక నీవు వెడలిపోయి నా యాజ్ఞ నెఱపుము.

నారద—హిరణ్యకసిపూ.

హిరణ్య—(కోపమున) ఏమి నా పేరుతోఁ బిలిచెదవు? దేవా యనుటకు నోరురాదా ?

నారద—దేవా ! తమకొక సంతోషవార్తఁ దెలుపవచ్చితిని. మీ యార్భాటములో మఱచితిని.

హిర—అదియేమి ? నెమ్మదిగఁ బల్కుము.

నార—దేవా ! దేవరవారికిఁ బుత్రలాభం బైనది.

హిర—నాప్రేయసి లీలావతి కనినదా.

నార—దేవా ! సుతునిఁ గనినది.

హిర—అటులైన వాయువేగ మనోవేగమున నిపుడే నామందిరంబుఁ చేరెద.

నార—దేవా ! దేవి మీమందిరమున లేదు.

హిర—ఎచట నున్నది ?

నార—నాయాశ్రమంబున.

హిర—అంతఃపురంబున నుండఁదగిన నా దేవి నీయాశ్రమం బెటు చేరెను.

నార—దేవా! దానిని వచింప దుఃఖకరమ్ముగ నున్నది.

హిర—నారదా! అదియేమి త్వరగాఁ దెలుపుము.

నార—దేవా! అది యింద్రునికృత్యము

హిర—ఇంద్రుఁడే మొనరించెను.

నార—దేవా! తాము ఘోరతపం బొనర్చుచు "ఆ మాటి" యతిగని యా భ్రాంతీశ్వరుఁ డింద్రుఁడు భ్రాంతిపడి, నీయంతః పురంబు సొచ్చి నీకామినినిఁ గొప్పుఁ బట్టి యీడ్చుకొని పోవుచుండెను. దానిని నేఁగని యా పతివ్రతా శిరోమణి చెఱ విడిపించి నా యాశ్రమంబున నుంచి కాపాడుచున్నాను,

హిర—(ఆగ్రహమున) ఏమీ! ఇంద్రునకు, నాయంతః పురంబుఁ జొచ్చునంతటి స్థైర్యము వచ్చెనా? నా కామినిం బట్టునంతటి సాహసము కలిగెనా? ఇదిగో యిపుడే పోయి వానినిఁబట్టి చీల్చెద.

నార—దేవా! దేవేంద్రునిఁబట్టి చీల్చిన వచ్చు లాభం బేమి? వాఁడు తమ పరాక్రంబు గ్గడించుచుఁ దా నొనర్చిన యపరాధంబునకు నేడ్చుచుఁ బడి యుండవలెను.

హిర—నారదా! నిజము.

చ॥ అమరపురంబుసొచ్చి యమరాధిపుఁ బట్టుచుఁ దిట్టి కొట్టుచున్
కుమతినిఁ దెచ్చి కార నిడి క్రోధముఁ దీర్చి కొనంగ వెళ్లెదన్

నార. విమలచరిత్ర దేవ తమ వీరసుఁ జేర్పుము దారపుత్రులన్
సుమ సమదేహ లీలలన సొంపలరె కానను నుండఁ జెల్లునే॥

హిర—నారదా! నీ వచనమ్ము లతి హితమ్ములు కావున నేను నీయాశ్రమంబునకుం బోయి లీలావతిని సమ్మోదవార్ధినిఁ దేల్చి పుత్రు మోము వీక్షించి యా సురాధమునకుఁ దగినశాస్తి పిదపఁ జేసెద వాఁ డెటుల నన్నుఁ దప్పించుకొని పోవును? రమ్ము నీయాశ్రమంబునకుఁ బోదము.

నార—మహాప్రసాదము.

(నిష్క్రమణము)



## ద్వితీయరంగము.

---

### అమరావతి.

[ఇంద్ర, అగ్ని, యమ, నైరృతి, వరుణ, వాయువు, కుబేర, ఈశాన.

బృహస్పత్యాచార్యులు-హిరణ్యకశిపు, విప్రజిత్తి-శంబర.]

ఇంద్రుఁడు—గురువులవారూ! నాకగు దుశ్శకునములను దెలిపితినిఁగదా! అందుల ఫలమేమి?

బృహ—దేవేంద్రా! నేనెన్ని విధముల నాలోచించి చూచినను నీకవి యశుభసూచకములుగ నగపడుచున్నవి. నీ కిది కష్టకాలంబు. సురకుల జన్మద్వేషులయిన హిరణ్యాక్ష హిరణ్యకశిపులలో హిరణ్యాక్షుఁడు హతుఁడయ్యెను. ఒక కంటకము దీరెనని సంతసించితిమి. రెండవ శ్వేషి హిరణ్యకశిపుఁడు కదా! వాఁడు ఘోరతపం బొనర్చుచుఁ దాఁ బ్రజ్వరింపఁ జేసిన తాపసాగ్నిచేఁ దానె మడిసెనని విని సంతసించి యుంటిమి. పిడుగుపడి నటుల నిన్నటి దినంబున వచ్చిన వార్త మా సంతసంబును గాల్చి మానసంబున మితిలేని వంతఁ గూర్చెను. ఏమి సేయవలయును? ఇంద్రా! ఇది నీకొక గండము. ఈగండము గొంతకాలంబు నిన్ను బాధించును.

ఇంద్రుఁడు—గురువర్య! ఈగండము గడచి పోవునంతవఱకు నేను నేఁ బన్నియున్న యుపాయము ననుసరించి కమలనాళములో డాఁగియుందునా?

(రాక్షసులు హాహాకారములతోఁ బ్రవేశింతురు.)

హిర—(ఇంద్రుని సింహాసనమునుండి దిగిచి వైచి) (విప్రజిత్తిం జూచి)

### అనుబంధము—14.

విప్రజిత్తీ! ఈ యష్టదిక్పాలకులను లేవనిమ్ము (విప్రజిత్తి వారి సెల్లగను బట్టి యీడ్చి నిలుపును (శంబరునిఁజూచి) శంబరా! వీఁడెవఁడో భట్టాచార్యుని బలెఁ గూర్చుండినాఁడు. లేపుము. (శంబరుఁడు బృహస్పత్యాచార్యులను లేపును) (విప్రజిత్తిఁజూచి) వీరెల్లరు హిరణ్యకశిపుఁడే తమ కులదైవం బని మ్రొక్కనిమ్ము (విప్రజిత్తి వారిని పంప వారు ప్రభువా యని మ్రొక్కుదురు.)

(బృహస్పతినిఁజూచి) ఓరే నీ వెవఁడవు ?

బృహస్పతి—దేవా ! నేను బృహస్పతిని.

హిరణ్య—ఆహా? నీవే నా బృహస్పతివి? శుక్రాచార్యుల ద్వేషి.

బృహ—నేనేమి ద్వేషి గాదు.

హిర—ఓరీ ! ద్రోషి నోరుమూయుము. తాపసజనులచే యాగములు సేయించుగాడు వాఁడవు నీవు కావా ?

బృహ—దేవా ! పిలిచినపుడు నేఁబోఁయి పని జరిగించెదను.

హిరణ్య—ఓరీ ! బృహస్పతీ నే నెవరు ?

బృహ—దేవా ! తాము దైవస్వరూపులని తామే పలికితిరే

హిర—ఓరీ ! దైవమే నేను.

బృహ—మహా ప్రసాదము.

హిర—నీవు యజ్ఞము సేయించునపు డిక మున్నాహుతులే దైవము నుద్దేశించి యెటు మంత్ర ముచ్చరించెదవు ?

బృహ—"హిరణ్యకసిపే స్వాహా" యని యాహుతులు వేల్తును.

హిర—మంచిది. అటు లొనరింపుము. (అగ్నినిఁజూచి)

ఓరీవహ్నీ—ఇటురమ్మీ.

(అగ్ని ముందరికివచ్చును.)

ఓరీ—పాగురుపాతా ! నమస్కరింపుము.

(అగ్ని నమస్కరించుచున్నాఁడు.)

ఓరీ ! నోటితో నేమియు నుచ్చరింపక నతు లిడెదవా ?

అగ్ని—"హిరణ్యకసిపు ప్రసీద" (యని నమస్కరించును.)

హిర—ఓరీ ! అగ్నీ ! నీకు రెండు పనులిచ్చెద యజ్ఞాహుతులు నాకుఁ గాను మోసీ కొని వచ్చుపని యొకటి నేను పిలిపించినపుడు వచ్చి నాయింట వంటలు సేయవల సిన పని రెండవది.

అగ్ని—మహా ప్రసాదము

హిర—ఓరీ ! బృహస్పతీ ! నాయాజ్ఞలేక కూర్చుంటివేల.

బృహ—దేవా! అలవాటువలన.

హిర—నీకు దండనలేక నిక్కి నావు నీవు సంకల్పము సేయునపు డెక్క దెవరి ప్రీత్యర్థ మని పలుకుదువు?

బృహ—"హిరణ్యకసిపు ప్రీత్యర్థ" మని వచింతును.

హిర—ఎవరయిన నీకు వందనం బిడిన యేమని దీవింతువు

బృహ—"హిరణ్యకసిపూ రక్షతు త్వాం" అని దీవింతును.

హిర—మంచిది. అటుల బుద్ధికలిగి బ్రతుకుము. కూర్చుండుము.

(యమునిఁజూచి) ఓరీ యమా! నీదండ మటుపైచి నాకు దండియు నెట్టుము.)

(యముఁడు నమస్కరించును) ఓరీ యమా! నీవిక నీ ప్రపంచమున నాయాజ్ఞ లేక యొక ప్రాణినైనను హింసింపకు తెలిసినదా!

యముఁడు—మహాప్రసాదము (నమస్కరించును)

హిరణ్యా—(నైరృతిఁ జూచి) ఓరీ నైరృతీ! నీవు దానవకుల నాపడుఁడవు కావున నీవు నాయింటిలో స పూర్ణమ్ము పని సేయుచుండుము.

నైరృతి—ప్రసాదము.

హిరణ్యా—(వరుణునిఁజూచి) ఓరీ! వరుణా! నీవు నా యింటి నీరు మోయుపనిఁ జేయుచుండుము.

వరుణు—(ప్రసాదము.)

హిరణ్యా—(వాయువుఁజూచి) ఓరీ పవనా! నీ వెల్ల కాలము నాకు వీవెనలు విసరుచుండుము.

వాయువు—ప్రసాదము.

హిరణ్యా—(కుబేరునిఁజూచి) ఓరీ ధనదా! నీవు ధనమదాంధతచే నిక్కి నీల్గుచున్నావు. కావున నీ నిధులన్నియును నా భాండాగారముఁ జేర్చి తదధికారిగ నీవుండుము.

హిరణ్యా—(ఈశానునిఁజూచి) ఓరీ! ఈశానా! నీ శరీర మర్థభాగము స్త్రీరూపమున నున్నది కావున నీ వేపనికిని బనికిరావు. నీవు వెడలిపొమ్ము. (ఇంద్రునిఁజూచి) ఓరీ! ఇంద్రా! ముందరికి రమ్ము. నీపనిఁ బట్టించెద.

(ఇంద్రుఁడు నమస్కరించును.)

ఎవఁడురా! నీకు బుద్ధి నేర్పినవాఁడు? నాపాదము లంటి నమస్కరింపుము.

(ఇంద్రుఁడు పాదములంటి నమస్కరించును.)

ఓరీ! నీకు నోరు పడిపోయినదా? పురుగు లంటెనా? నోటితో నేమియు నుచ్చరింపక నమస్కరించెదవా?

ఇంద్రుఁడు—"హిరణ్యకసిపూ ప్రసీద" (యని మరలఁ బాదములపైఁ బడును.)

హిరణ్య—ఓరీ! ఇంద్రా! నేను లేనప్పుడు నీ వేమొనరించితివి?

ఇంద్ర—దేవా! నే నపరాధిని. శతాపరాధిని. సర్వాపరాధిని. (మొక్కును)

హిరణ్య—నీవు శరణంటివి కావున నినుఁ జంపను. నిన్ను నా కారలో నుంచెద నీ వజ్రాయుధ మటు పెట్టుము. పెట్టుము. కడిగఁ బెట్టుము. ఏమి యాలోచించెదవు. పెట్టవా! (విప్రజిత్తినిఁ జూచి) విప్రజిత్తీ! వాని చెంపలు వాయించి గుంజిళ్లు బెట్టించి, వజ్రాయుధ మూడఁదీయుము. ఐరావతమును నా పురికిఁ దోలుము. శచి నాప్రేయసి దాసియై యుండనిమ్ము.

విప్ర—(విప్రజిత్తి యింద్రుని చెంపలు వాయించి గుంజిళ్లు బెట్టించును.)

హిరణ్య—శంబరా! మనము వచ్చినపని ముగిసినది. ఈనీచుని విభవ మంతయుఁ జూడఁ గాని వీని నీడ్చుకొని వెడలుము. నేనును వచ్చెద.

## అనుబంధము—15.

(నిష్క్రమము.)



# తృతీయరంగము.

## భవనము.

హిరణ్యకశిపుఁడు, లీలావతి, ఉయ్యాలలోని ప్రహ్లాదుఁడు, శచి.

అనుబంధము—16.

(ప్రహ్లాదుఁడు వచ్చును.)

లీలావతి—నాయనా! నీకు నిదుర ప్రాప్తమైనది. లాలిలో వైచి యూచెదను రమ్ము.

ప్రహ్లాదు—అమ్మా! లాలి పాడెదవుకదా?

లీలావతి—పాడెదను రమ్ము

లీలావతి-(ప్రహ్లాదునిఁ బరుండఁబెట్టి లాలిపాడుచు నుయ్యాలలూఁగుచు.)

వినయ సద్గుణధామ విభవాభి రామా
వినుత పావన నామ విమతారి భీమా॥ లాలీ ॥

ఘనజన తామోద ఘనసాధు వాదా
యనఘ చారువినోద యఘ పశుచ్ఛేదా॥ లాలీ ॥

సూరివంశ శ్రీద సుకవి సమ్మోదా
భూరి విద్యామోద భువన ప్రహ్లాదా॥ లాలీ ॥

నారదాంశాచ్ఛాద నపరసాపాదా
సార సౌఖ్యాపాద సరస ప్రహ్లాదా॥ లాలీ ॥

కదలక మెదలక కనుఁగవను మూసి
నిదురపో నిదురపో నిసదమును బాసి॥ లాలీ ॥

అదరక బెదరక నలసటను ద్రోసి
సదయత కనును నీ శచియనెడు దాసి॥ లాలీ ॥

(శచింజూచి) శచీ నాబాలునకు నిదురపట్టెను కాచికొని జాగరూకత నిటు నిలిచియుండుము. నేనింటిలోఁ బోయి మరలవచ్చెద.

(నిష్క్రమము.)

శచి—(స్వగ) హా! హా! దిక్పాలవరులలో ముఖ్యుఁడైన సురపతి తరుణినయి స్వర్గ వైభవానుభవముల నతిశయించి సుఖమున నింటమనియున్న శచి దౌర్భాగ్య దేవతావశయయి యిపుడీరీతి జ్ఞాతనారికి కులవిద్వేషికుల సతికి క్రూరునివారికి దానవేశుని మానినికి నూడిగపుఁ బనులు సేయు కష్టకాలము ప్రాప్తిల్లెనుగదా? విధి విచేష్టితంబు లెవ రెఱుంగుదురు? అదియేమొ నేనెన్ని కష్టము లనుభవించుచుఁ గన్నీరుఁ గార్చుచుండినను, ప్రహ్లాదుని బాలుని మోముఁ జూచిన క్షణముననే నాకుఁ బట్టరాని సంతోష ముట్టిపడులాగున నంకురించుచున్నది. వైరి శిశువనెడి యసూయత మనమునఁ బుట్టదు. కారణమేమో తెలియదు?

(హిరణ్యకసిపుని ప్రవేశము.)

హిరణ్య—(శచినిఁజూచి) ఓసీ! దాసీ! చిన్నవాఁడు ప్రహ్లాదుఁ డేమి సేయుచున్నవాఁడు?

శచి—దేవా! నిదురఁబోవుచున్నాఁడు.

హిరణ్య—లీలావతి యేదీ?

శచి—ఇపుడే భవనములోనికి వెళ్లినది.

హిరణ్య—బుద్ధిలేనిది. వైరినారికి బాలుని నప్పగించి పోయినది. శచీ భద్రము బాలునకే బాధ కలిగినను నిన్ను శిక్షింతును.

(అనుచు నుయ్యేల సమీపించి బాలుని మోము వీక్షించును.)

ప్రహ్లాదుఁడు—(ఉయ్యేలలోఁ బరుండి) నారాయణ నారాయణ.

హిరణ్య—(ఉలికిపడి దూరమునకువచ్చి) ఏమి దుర్దినంబిది? నా వైరినామము నా వీనులఁ బడెను. మాటలురాని బాలునకీ నామ మెటుల వచ్చెను? ఈదాసి, వీని నెత్తుకొని సదాకాల మా నీచుని నామంబుఁ బలుకుచుండునేమో? పిల్లలకు "అయ్య, అమ్మ" యను నామములు వచ్చినటుల నీదాసి యీబాలునకా మాట నేర్పియుండును.

(శచింజూచి) ఓసీ దాసీ! లీలావతిని నిచటికిఁ బిలిచికొనిరమ్మ.)

(శచి లీలావతినిఁ బిలిచికొనివచ్చును. లీలావతిఁజూచి)

లీలావతీ! ఈబాలుని సదాకాల మెవరెత్తి డించుచుందురు?

లీలావతి—మోహనాంగా! నేనేను.

హిరణ్య—ఈదాసి చేతికి నియ్యవుగదా?

లీలావతి—ఎప్పుడును లేదు.

హిరణ్య—ఆటులయిన మాటలు రాని యీబాలునకు నావైరి నామం బెటువచ్చెను?

లీలావతి—ఎవరి నామము.

హిరణ్య—(గట్టిగ) నావైరినామము నావంశ ద్వేషినామము నాసోదరుని జంపిన నీచుని నామము.

లీలావతి—ఆ నామస్మరణ మాయింటనే లేదే?

హిరణ్య—ఇదిగో వినుము (లీలావతిని డోల సరసకు బిలిచికొని పోవును.)

(ఇద్దరువంగి బాలునిమోము వీక్షింతురు.)

ప్రహ్లాదుడు—నారాయణ నారాయణ.

హిరణ్య—(కోపమున) అదిగో వింటివియా?

లీలావతి—నాథా! మీరు పొరబడుచున్నవారు. నారదుల యాశ్రమంబున నుండిన తఱి నేను నారదులను "నారద నాయనా" యని పిలుచుచుంటిని బాలుడు వినుచుండెను. బాలుడైనను సూక్ష్మగ్రాహి కావున మొదటి రెండక్షరములు తుది రెండక్షరములు గ్రహించి దానాయను మధ్యాక్షరములు వదలి నాదము సేయుచున్నాడు.

హిరణ్య—ఉండును. అయినను భద్రముగ నుండుము. (నిష్క్రమించును)

లీలావతి—(స్వగ) నారదులవారు వచించిన రీతి నీబాలునకు గర్భమునందే నారాయణారాధన పట్టుబడినది. దీనినుండి యనేకానర్థము లుప్పతిల్లుట నిస్సందేహము. నేనేమి సేయగలను? కానున్నవి, కాక మానునా?

(నిష్క్రమము.)



## చతుర్థరంగము.



భవనము.

లీలావతి, నారదుడు, హిరణ్యకశిపుడు, ప్రహ్లాదుడు, శంబరాదులు.

హిరణ్య—శంబరామాత్యా! అహర్నిశలు నాకు నిదురరాక యున్నది. ఆనీచుని నా సోదరహంత నెపుడెపుడుపట్టి చీల్తునాయని చింతిలుచున్నాను. అయవాచుకొని

నీచుని నామంబు నానోటికి రాకయున్నను, నామానస మందహోరాత్రములు నానుచుండును.

శంబరు—దేవా! నేఁటికెన్నియో వత్సరములకుము న్నే చచ్చి దుమ్మయి నీటిలోఁగలిసి పోయినవాఁడు మరల మీకుఁగాను బ్రదికివచ్చునా? మీచేఁ జచ్చుట స్వతస్సిద్ధమని, నిర్ధరించి స్వహస్త మరణమే సమ్మతమనియెంచి మున్నీటిలో మునిఁగియో భృగుపాతముననో, గతించినాఁడు. ఇఁక మీరు వాని పేరుచ్చరింపకుఁడు.

హిరణ్య—నిజము. నిజము. అటు లొనరించెద.

(నారదుని ప్రవేశము.)

నారద. గీ॥ దానవాన్వయ భూషణా తేనమోస్తు
దితికులాంబుధి చంద్రమా తేనమోస్తు
భూనభోంతర పూజితా తేనమోస్తు
దీనజనతార్తి నాశనా తేనమోస్తు.

దేవా—హిరణ్యకశిపూ! వందనంబు లాచరించెదను.

హిరణ్య—సౌభాగ్యమస్తు. నారదా! చతుర్దశ లోకంబులు నన్నుఁ బూజించునా?

నార—(తలఁగొట్టుకొనుచు)

అనుబంధము—17.

దేవా! ఎచ్చటఁ జూచినను. నెయ్యది విన్నను దమ మహిమాతిశయ వర్ణనమే గాని మఱియొకటి నావీనులం బడదు.

హిరణ్య—సరి. దైవమహిమ యిటు లుండవలదా? నారదా!, ఇపుడు నీరాకకుఁ గారణం బేమి.

నార—దేవా! నాయాశ్రమంబువదలి వచ్చినప్పటినుండి నేత్రానందముగఁ బ్రహ్లాదుని జూచు భాగ్యంబులేదాయె. చూచిపోదమని వచ్చితిని.

హిరణ్య—మేలు సేసితివి. రాజకార్య బాహుళ్యమున బాలునిఁ జూడక నాకును బహుకాలమాయెను. వాని నిపుడే పిలిపించెదను. (లీలావతినిఁ జూచి) లీలావతీ! బాలు నిచటికిఁ దోడితెమ్ము.

లీలావతి—మోహనాంగా! నారదులవారిని భవనములోనికిఁ బిలుచుకొనిపోయి బాలునిఁజూపి పంపుదును. వాఁడు బాలురతో నాఁడుకొనుచుండును. ఆటను వదలి వచ్చునో రాఁడో.

(నారదుఁడు తలయూఁచును.)

హిరణ్య—లీలావతి! నేనును జూడవలెను. బాలుని బిలచికొనిరమ్ము.

లీలావతి—మంచిది.

(నిష్క్రమించును.)

హిరణ్య—నారదా! వాని యునికి జాడ యేమయినను దెలిసెనా? వైకుంఠ మిపుడేరీతి నున్నది?

నారదు—దేవా! పాఁడుపడినది. చూడ బుద్ధి పుట్టదు. లక్ష్మీదేవి యొక్క పాడుపడిన గదిలోఁ బడినది.

హిరణ్య—వాఁడుండిన లక్ష్మినైనను బల్కరింపను రాకయుండునా?

నార—అయినను నాకేమో యనుమానముగ నున్నది. అతఁ డప్పుడువచ్చి రమావధూటిని మాటాడించి పోవునని కర్ణాకర్ణికగ వింటిని.

హిరణ్య—వాఁ డుండినయెడల నెచట దాఁగియుండును.

నార—నీటిలోఁ డాఁగెనని కొంద ఱందురు. నీ హృదయములోనో నీయింటిలోనో డాఁగినాఁడని కొంద ఱందురు. నిజము నిలుకడమీఁదఁ దెలియును.

(లీలావతి ప్రహ్లాదునిఁ బిలిచికొనివచ్చును.)

హిరణ్య. కం॥ రారా ముద్దులబాలా
రారా సుగుణాలవాల రాజితశీలా
రారా యహితాభీలా
రారా యరికాష్టకీల రా జనపాలా॥

(అనుచు నెత్తుకొని ముద్దిడును.)

(ప్రహ్లాదునిఁజూచి) నాయనా! ఏమిచేయుంటివి.

ప్రహ్లా—ఆడుతుంటిని.

హిరణ్య—ఎవరితో!

ప్రహ్లా—హరితో.

హిరణ్య—(దిగులుపడి) ఏమీ! ఏమీ! ఎవరితో నాడుచుంటివి?

ప్రహ్లా—హరితో.

హిరణ్య—వాఁ డెచ్చట నున్నవాఁడు.

ప్రహ్లా—ఇదిగో.

హిరణ్య.—ఆడుము.

ప్రహ్లా—(గజ్జెలు ఘల్లుమన జిందులు ద్రొక్కుచు.)

గేయము. హరిహరిహరిహరి
హరిహరి హరి హరి
హరిహరి హరిహరి
హరి హరి భో॥

హిరణ్య—(బాలునియాట నిలిపి) (లీలావతిని జూచి) లీలావతీ! ఈపాడునామం బెటు లీబాలునకు సిద్ధించె?

లీలావతి—మహారాజా! నిన్నటిదినంబునఁ బ్రొద్దుపోక మన వనము నందుండు వస్తుప్రదర్శన వినోదశాలకుఁ బోయియుంటిని. అచ్చట బాలుఁడు వినోదముగ జంతుజాలములఁ జూచుతఱి నెచ్చటనుండియో యొక మహిమాస్పదుఁడు వచ్చెను. ఈబాలుఁ డతనిఁ జూచి జంతువుల పేర్లడుగ సాగెను. ఆమహాత్ముఁడు కప్పకును, చిలుకకును, కోతికిని, సింహమునకును, కోకిలకును, నెమలికిని హంసకును, హరి హరియని యొక పేరే పలుక సాఁగెను. బాలుఁడు తెలియనివాఁడు కావున నా పేర్లె యెపుడు నుచ్చరించుచుండును.

నార—(స్వగ) ఔరా! పిల్లలను శిక్షనుండి తప్పించుటకుఁ దల్లులెంత త్వరలో నుపాయ మూహింతురు!

హిరణ్య—(శంబరునిజూచి) ఓరీశంబరా! ఆ నీచవాచకమే జంతువునకుగాని యుండ నటుల శబ్దప్రపంచకమునుండి యాశబ్దముఁ దొలఁగించి వేయుమని బ్రహ్మకు నాజ్ఞ యిడుము. కవు లెవరు నాశబ్ద మెచట నుపయోగింపఁగూడదని సత్రిక బ్రకటింపుము. (లీలావతిఁజూచి) లీలావతీ! భద్రము. ఆనీచవాచక మింతటితోనుండి బాలుఁ డుపయోగింప నటులఁ గనిపెట్టియుండుము.

(నారదునిఁజూచి) నారదా! పోయిరమ్ము (శంబరా నీవును వెళ్లుము.)

నారద—

## అనుబంధము—18.

(నిష్క్రమము.)

హిరణ్య—ఈనారదుఁడు పలికినరీతి నానీచుఁడు నాయింటఁ బాఁగి యీబాలున కుపదేశించుచుండునా ? ఇఁకఁ గొన్నిదినంబులు గాచి చూచెద. (ప్రహ్లాదునిఁ జూచి) నాయనా ! అది చెడ్డపేరు నీనోట నుచ్చరింపకు. వదలుము.

ప్రహ్లా గీ॥ పాలుబువ్వఁ బాసి బాలుఁ డెవండైన
కొఱ్ఱకూడుఁ దినఁగఁ గోరు నెటుల ?
సుధను వలదటంచు సుర్ద భుజించెడు
వెఱ్ఱిమొద్దుకలఁడె యిలను తండ్రి ?



## పంచమరంగము.



లీలావతి, హిరణ్య, ప్రహ్లాద, శంబర, అశ్వినీదేవతలు, భూతపతి.

హిరణ్య—ప్రేయసీ ! మనబాలుఁడు దినదినాభివృద్ధినిఁ గనుచున్నవాఁడు గదా. వానికి విద్యాభ్యాస కాలము సమీపించెను. చదువనిబాలుఁడు చెడును. మూఢుఁడగును.

లీలావతి—ప్రాణనాథా ! అపుడే యీచిన్ని చిఱుతకుఁ జదువేల ? ఇఁకను గొన్నిదినంబు లిటులనే యాడికొనుచుండనిండు.

హిరణ్య—లీలావతీ ! వానినిఁ బిలిపింపుము. చదువుఁ జదివి వాని సారము గ్రహించునంతటి తెలివి వానికిఁ గలిగినదియా లేదా యనెడి విషయము వానినిఁ బల్కరించి కనిపెట్టెద.

లీలావతి—(మంచిది) పిలిచికొనివచ్చెద.

(అనుచు నిష్క్రమించి ప్రహ్లాదునితోఁ బ్రవేశించును.)

ప్రహ్లాదుఁడు—(చిందులు ద్రొక్కుచు.)

హరినారాయణ హరినారాయణ హరినారాయణ హరే హరే
యరవింద్రావణ యరవిందానన యఘసంశోషణ హరే హరే

పరపారాయణ స్థిరసంతర్పణ పరసంరక్షణ హరే హరే
కరుణావీక్షణ కమలాధారణ కవిహృత్తోషణ హరే హరే ॥

హిరణ్య—(కోపమునఁ గాలుఁగొట్టి) లీలావతీ! ఈహీన వాక్కులు వీని కెవరు నేర్పిరి?

లీలావతి—నాకేమియుఁ దెలియదు, నా సరసనుండు తఱిఁ జక్కఁగ మాటలాడుచు నాడుకొనుచుండును తమ మోముఁ జూచినపుడు వాఁడిటు మాటలాడుచుండును.

హిరణ్య—(స్వగ) నా దురదృష్టి మిది (ప్రకాశముగ) ప్రహ్లాదా! నీకీ శ్లోకం బెవరు నేర్పిరి?

ప్రహ్లాదు—శ్రీహరి.

హిరణ్య—వాఁ డెవఁడు.

ప్రహ్లాదు—దైవము.

హిరణ్య—బాలకా! దిక్కుమాలిన నిర్భాగ్యుఁడే వాచ్యుఁడు వాఁడు. వానినేల నుతించెదవు.

గీ॥ దిక్కుమాలుచు దిశదిశల్ దిరుగువాని
నిల్లులేకను బలు తల్లడిల్లువాని
తల్లిదండ్రులు లేకయ తనరువాని
దేవుఁడనకుము దితికులదీప నీవు ॥

బాలకా! ఆనీచ కులాధముని, ననామధేయుని, నవాచ్యుని దైవమని తలఁప నగునా? వలదు వదలుము.

ప్రహ్లాదుఁడు—తండ్రీ! ఎంతటి యజ్ఞానంబిది.

గీ॥ తల్లిదండ్రులు లేక యు తనరుచుండి
జగతికెల్లను జనకుఁడై జననియగుచుఁ
బిల్లలకుఁ దల్లిఁబోలుచుఁ బెంచుచుండు
దైవమునకంటె మఱియెద్ది దైవమిలను ॥

నయనా—సకల భూత కోటికి జననస్థానంబై తదంతరస్థంబై యుండు దైవమును దైవము కాదని నీవాఁడు మాటలు చిత్రంబులుగ నున్నవి.

హిరణ్య—(కోపమున) ఓరీ! ఉన్మాదా!

చ॥ హరిహరి శ్రీహరీయనుచు నాడెదవేమి యున్మాదమో కదా?
హరి సురమాడనెన్నుచు నహర్నిశలెల్ల జగంబు లబ్ధులన్
నరసురలోకముల్ మఱియు నాగ విహంగమ రాజ లోకముల్
దిరుగుచుఁ గాన లేన యితి దిక్కులఁటి దొంగఁగ నెందుడాఁగెనో॥

ఓరీ! నీకు నున్మాదము బలమైనది. ఏనాఁడో చచ్చి వసుగైన వానిని దైవమని ప్రేలెదవు. వానికిఁగాను నే వెదకివెదకి వేసరితి.

ప్రహ్లాదు—జనకా! నీవు నైనేను జింతింముచున్నాను. ఆ హరికిఁ గాను సర్వప్రపంచము వెదకితివియా యేల?

కం॥ నీవారపు శూకాకృతి
నేవారల డెందమందు నిల్లుగ నిలుచున్
దేవారుల నొందుమను తన
సేవారతుల యున వారి సేమముఁ బెంచున్॥

జనకా! నిన్ను నీవు దెలిసికొనక వెన్నుని జగమెల్ల వెదకితి నంటివే. ఏమి విమోహంబిది?

హి. చ॥ పలికెదవేమి నీవిటుల బాలక భ్రాంతియొ పిచ్చిపైత్యమో
తెలుపుము దివ్యవైద్యులను దెచ్చి మహౌషధమిచ్చి మాన్పెదన్
తెలివియువచ్చు దెల్లముగ దీర్ఘతరాయువు హెచ్చు చిత్తసం
కలిత మహౌషధంబుసుఁగుఁ గాదె కులంబకళంకమై తగన్॥

బాలకా! నీకుఁ బిచ్చి తలకెక్కి ముదిరినది. మంచి యౌషధ మిప్పించెద (శంబరునిఁజూచి) శంబరా! ఆ యశ్వినీ దేవతలం బట్టితెమ్ము. వీనికి దివ్యౌషధ మిప్పించి రోగము కుదిర్చెద.

శంబరుఁడు—ఇపుడే వారినిఁబట్టి తెచ్చెద. (నిష్క్రమించును.)

ప్రహ్లాదు—తండ్రీ! నీవేల యీ విమోహ వారిధిలోఁబడి మునుఁగుచున్నావు నిన్నావరించిన మాయను వదలింపఁ జాలకున్నావు.

గీ॥ ఓషధులసార మెల్ల నీరూరఁబిల్చి
యమృతరసమున మర్దించి యాదిదేవుఁ
డఖిల రోగార్త జనులకు నావటింపు
మాత్రఁ గనుఁజేసెఁ దన దివ్య గాత్ర మెలమి ॥

తండ్రీ—దివ్యౌషధమాత్ర హరిరూపముగ నాకు లభ్యమై యుండ నితర ఔషధములు నాకు రుచించునా? అవి ఫలకారియగునా? వలదు.

(శంబరుఁ డశ్వినీ దేవతలతోఁ బ్రవేశించును.)

అశ్వినీదేవతలు—దేవా వందనంబులు. పిలిపించిన కార్య మేమో యాజ్ఞయిడుడి. శిరసావహించి చేయుదుము.

హిరణ్య—అశ్వినీ దేవతలారా! చూచితిరా యీబాలుని? వాఁడు నా కుమారుఁడు వానికిఁ బిచ్చిరోగము బలమైనది.

అశ్వినీ—(ప్రహ్లాదుని నాడి పరీక్షించి) దేవా! వీఁ డన్నిట నారోగ్యముగ నున్నవాఁడు సమశీత పిత్తశ్లేష్మముల నొప్పారుచున్నాఁడు వీనిది రోగముకాదు. భూతావేశ మేమైన నయినదో యేమో? ఆ చికిత్స మాకుఁ దెలియదు. భూతపతి వచ్చి మంత్రించిన బాగుగ నుండునని మాకుఁ దోఁచెడు.

హిరణ్య—అటులైన మీరు వెళ్లుడి. (అశ్వినీదేవతలు నిష్క్రమింతురు.) (శంబరునిఁజూచి) నీవు నీ మాయాబలంబునఁ బోయి భూతపతినిఁ బిలిచికొని రమ్ము. అతఁడు దివ్యమంత్రములు మంత్రించి వీనికిఁ బట్టిన పిశాచము వెళ్లఁగొట్టును.

శంబరుఁడు—మహాప్రసాదము. (నిష్క్రమించును.)

ప్రహ్లాదుఁడు—తండ్రీ! మానసమునకు నంటినది మంత్రమునఁ బోవునా?

కం॥ మంత్రముల ముఖ్య మంత్రము
తంత్రములం దెల్ల ముఖ్యతంత్రము మఱియున్
యంత్రముల ముఖ్య యంత్రము
సంత్రాసులఁ బ్రోచు మంత్రసారము హరియా॥

తండ్రీ—అట్టి మంత్రసాధనగల నాపై భూతపతి మంత్రము పాఱునా? వదలు మీ ప్రయత్నము వలదీ భ్రాంతి.

(శంబరుఁడు భూతపతితోఁ బ్రవేశించును.)

హిరణ్య—భూతపతీ! ఇదిగో వీఁడు నాకొమారుఁడు. వీనియందుఁ బిశాచావేశమైన కారణంబున నేమేమో ప్రేలుచుండును. నీవు పిశాచోచ్చాటన మంత్రంబు పఠించి బాలునిఁ గాపాడుము.

భూతపతి—(ప్రహ్లాదునిఁ జక్కఁగఁ జూచి) బాలకా! నీయం దేమియున్నది.

ప్రహ్లా—శ్రీహరి దివ్య చరిత్రసారము.

భూతపతి—(హిరణ్యకశిపునిఁ జూచి) దేవా! ఈబాలునం దే భూతావేశమైనది కాదు. వీనికి వైరాగ్యపదము ముదిరినది. ఈమార్గమునుండి వీనినిఁ ద్రిప్పుటకు విద్యయే, సాధనము. కావున వీనికి విద్యాభ్యాసము చక్కఁగఁ జేయింపవలెను. ప్రారంభమున సరస సాహిత్య గ్రంథంబు లభ్యసింపనిండు.

హిరణ్య—నిజము. మంచి యుపాయము. పిల్ల లింట నిలిచి తలిదండ్రులచే ముద్దుగఁ బెంపఁబడినచో, మొద్దులగుదురు. కావున వీనినిఁ గొనిపోయి నా కులగురు పుత్రులగు చండామార్కులకు నొప్పగించెద. వారు శిక్షించినచో వీఁడు చక్కఁబడును. (ప్రహ్లాదునిఁజూచి) ఓరీ! ప్రహ్లాదా! రేపటినుండి నిన్ను గురువుల వారివద్దకుఁ జదువ నంపెద.

ప్రహ్లాదుఁడు—తండ్రీ! గురువులనఁగ నెవ్వఁడు? హరికిదా?

చం॥ గురువులనంగ నెవ్వరొకొ కూరిమిఁ బెంచినవాఁడు తండ్రియా
నరుదుగ శిక్ష సల్పుచును నక్షర సంజ్ఞల నేర్పునట్టివాఁ
డరయఁగ నయ్యవారయె మహామహితాత్ముఁడు లోకకర్త
కరశుభమూర్తియా హరియె కాదె గురుండఖిలాండకోటికిన్ ।

ఇట్టిగురుని వదలి యితర గురు శిక్షనుండి ప్రయోజనం బేమి?

హిరణ్య—ఓరీ! విభ్రాంతా నోరుమూయుము. నావెంటరమ్ము.

అనుబంధము—19.

ప్రహ్లా—(పాటఁ బాడుచుఁ బోవును.

(నిష్క్రమము.)



శ్రీ

# ప్రహ్లాదనాటకము.

## తృతీయాంకము — ప్రథమరంగము.

చండామార్కుల గృహము.

[చండుఁడు-అమార్కుఁడు-ప్రహ్లాదుఁడు.]

చండుఁడు=అమార్కా! మన రాజపుత్రుని విద్యాభ్యాసంబున కిది మంచి కాలంబుగ నున్నది. కావున నిప్పుడే ప్రారంభింతము

అమార్కుఁడు—అన్నా! నేఁ దక్షరాభ్యాసంబుఁ గావించి కొన్నిదినంబు లింట నుంచుకొని యిచటనే చదువు చెప్పెదము. మన పాఠశాలలోఁ గల బాలు రతి దుర్మార్గులు. మొద్దులు. అట్టివారి సంగతి నీ రాజకుమారుని నుంచినచో వీనికిని వారి గుణంబులు వచ్చును. చెడ్డగుణములు మాత్రము పిల్లవాండ్రు చూచిన తక్షణముననే గ్రహించి, గ్రహించిన దానిని సుడుముబలె గట్టిగఁ బట్టుకొందురు. పిదప మనకా చెడ్డగుణమును వదలించుట యొకపనియు మంచిగుణము నేర్పుట మఱియొక పనియును రెండుపను లేర్పడును. కష్టమగును.

చండ—అనుజా! నిజము. శుభకాల మతిక్రమింప నేల? ఏడీ ప్రహ్లాదుఁడు? పిలుచు కొనిరమ్ము.

(అమార్కుఁడుపోయి ప్రహ్లాదునిఁ బిలిచికొనివచ్చును.)

(ప్రహ్లాదునిఁ బీఠముపైఁ గూర్చుండఁబెట్టి) ఓరీ! అమార్కా! ఇటీవల మన మొనరించిన హిరణ్యకశిపు గల్యాగమము తెమ్ము. ఆనూతన మంత్రము లింకను నోటికి రావు.

అమార్క—అన్నా! సాకువచ్చును, నేఁ జేయించెద.

ప్రహ్లాదా! నే ననినట్లనుము.

ప్రహ్లాద—మంచిది.

అమార్కు—"ఓం దితిసుతాయ స్వాహా" యని యాచమింపుము.

ప్రహ్లాద—"ఓం కేశవాయస్వాహా" యని యాచమనము చేయును.

(చండామర్కు లొకరిమొగ మొకరు చూచుకొని)

చండు—ప్రహ్లాదా! నీవు పలికినది పూర్వకాలపు మంత్రము. ఇప్పుడా మంత్రము పోయినది. నూతన మంత్ర మేర్పడినది. మేమనిన రీతి ననుము.

అమార్కు—"ఓం దితిసుతాయ స్వాహా" అనుము.

ప్రహ్లాద—"ఓం కేశవాయ స్వాహా" అనును.

చండు—ఇదియే మిది ఆదిలోనే హంసపాదము (అమార్కా కానిమ్ము)

అమార్కు—"ఓం సురనాశాయ స్వాహా" అనుము.

ప్రహ్లాద—"ఓం నారాయణ స్వాహా" అనును.

చండుఁడు—(అమార్కునిఁజూచి) అనుజా! మంత్రములు నీవే యుచ్చరింపుము.

అమార్కు—అటు లొనరించెద.

"ఓం దితిసుతాయ స్వాహా" "ఓం సురనాశాయ స్వాహా" "ఓం అసురకులాధీశాయ స్వాహా" (అని తానే యాచాంతి చేయును)

(ప్రహ్లాదుఁడు రెండు చేతులతోఁ దన రెండు చెవులు మూసికొనును.)

చండుఁడు—ఏమి ప్రహ్లాదా! వీనులు మూసికొని యెదవు?

ప్రహ్లాద—స్వామీ! దుర్మంత్రములు వినినఁ బాతకము.

చండుఁడు—అమార్కా! మనకిది కష్టమైన పనిగ నున్నది. ఈయాచమనాచారముఁ బరిత్యజింపుము. తండులపూరితభాండమునుఁ దెచ్చి బీజాక్షరము వ్రాయించి పూజింపఁజేయుము.

అమార్కు—మంచిది (అని బియ్యమునించిన పళ్లెరముపైఁ గలశ ముంచుకొనివచ్చి ప్రహ్లాదుని తొడపై నిడి వ్రేలుపట్టుకొని)

(ఓం)తిద్దించును. ప్రహ్లాదుఁడు తిద్దును. మరల "న" వ్రాయించును. ప్రహ్లాదుఁడు వ్రాయును. మరల "మో" వ్రాయించును. ప్రహ్లాదుఁడు వ్రాయును మరల "హి" వ్రాయింప నుద్యమించును. ప్రహ్లాదుఁడు "నా" వ్రాయును.

ఏమి ప్రహ్లాదా ! నేను "హి" తిద్దించితే నీవు "నా" తిద్దెదవు ?

ప్రహ్లాదు—స్వామీ ! "హి" వికారార్థము సూచించును "నా" శ్రేష్ఠమగు పురుష వాచకముఁ బ్రకటించును కావున "హి" కంటెను "నా" యత్యధికంబు.

చండుఁడు—అమార్కా ! గురువుకంటెను శుద్ధుమించెను. వీనితో వ్రాయింపనేల ? నోటితోఁ బలికింపుము.

అమార్కు—ప్రహ్లాదా ! నేఁ బలికినటులఁ బల్కుము. చక్కఁగ గమనింపుము. "ఓం నమో హిరణ్యకశిపవే" అనుము అనుము.

ప్రహ్లాదు—"ఓం నమో నారాయణాయ" అనును.

అమార్కు—ఏమి ప్రహ్లాదా ! నే నొకటి పలికిన నీవు మఱియొకటి పలికెదవు ?

ప్రహ్లాదుఁడు—స్వామీ ! తమ కేల యీ తామసమును వహించెదరు ?

కం॥ పలికెడువాఁడును హరియే
పలికించెడువాఁడు హరియే పలుకఁగ నేలా !
పలుమాపము లెత్తుచు హరి
జెలువారఁగ నెల్ల జగతిఁ జెలఁగుచు నుండున్॥

చండుఁడు—అమార్కా ! వీనిమార్గము వేఱైనది. ఈయోగ మాచారంబు వీనియెడ సిద్ధింపదు. వీనికి సాహిత్య గ్రంథములు చెప్పుదము.

అమార్కు—అచట ఋతువర్ణన వనవిహారము వనితా సౌందర్యవర్ణన యివి చదివినయెడల వీఁడు చక్కఁబడును. (ప్రహ్లాదునిఁ జూచి) ప్రహ్లాదా ! ఈపూజ యిఁక నిలిపెదము రమ్ము పోవుదము.

(నిష్క్రమణము.)



## ద్వితీయరంగము.



భవనము.

హిరణ్యకసిపుఁడు, 7 యేండ్ల ప్రహ్లాదుఁడు, చండామార్కులు, లీలావతి.

హిరణ్య—నాతీ! ఆజన్మద్వేషులపై నీకేల యింతకరుణ? ఆ సురనాథుఁడు కారనే పడి చావనిమ్ము వానిభార్య కచి, నీకు దాసియైయుండ నిమ్ము.

లీలావతి—అటులయిన వారికి విచారము లేదా? ఆపతి యాటులనే వెతలచేఁ గుందుచుండదలెనా?

హిరణ్య—నాతీ! నీ వాఁడు దానవు గాన నీకు రాజ్యక్షేమం బెటు కలుగునను నది తెలియదు. ఇందున నీవు ప్రవేశింపకుము. మనబాలునిఁ బిలిచికొనిరమ్మని శంబరునిఁ బంపినాఁడు. వాఁ డిపుడే వచ్చును.

కం॥ మన గురువు కేమి గఱపిరొ
మనబాలుం డెటుల చదివి మాన్యుం డయెనో
వినియెద వీనుల విందుగ
మనసారఁగ బాలువిద్య మహితను గనుచున్॥

(శంబరుఁడు, చండామార్కులు ప్రహ్లాదులు ప్రవేశింతురు.)

(కొడుకును కౌఁగలించుకొని)

కం॥ రావయ్యా ప్రహ్లాదా
రావయ్యా విగతఖేదా రా సుశ్రీదా!
రావయ్య నీవు జనకుని
దీవెనలను నంది మనుము దీర్ఘాయువుగన్॥

(అనుచుఁ బిలిచి తొడపైఁ గూర్చుండఁ బెట్టుకొని)

నాయనా! ప్రహ్లాదా! ఎంత చిక్కిపోయినావు? నీగురువుల వారింట నీకు సుఖములేదా? చదువుచేఁ జిక్కిపోయితివా? ఏమిచదివితివి? ఏదీ! చదివిన చదువులలో నెద్దియయిన నొకవిషయము ముచ్చటింపుము.

గీ. శ్రీహరిధ్యాన మెత్తఱిఁ జేయనోప
కున్న జన్మము జన్మమే యన్నగాక
శ్రీపతి స్తవమే నాఁడుఁ జేయనట్టి
ఖలుని జిహ్వయు జిహ్వయే బిలముగాక.

హిరణ్య— (కోపమునఁ గత్తి పెఱుకును.)

లీలావతి— మోహనాంగా! ఏమి యీక్రౌర్యము? ఎవరిపైన? మన పసిబాలునిపైనా? పుట్టినబాలు రెల్లరు పండితు లగుదురా? వివేకులగుదురా? నూటిలో నొకఁడు వివేకి యగును. వలదీ క్రౌర్యము.

క. కడుపునఁ బుట్టినబాలుఁడు
జడుఁడైనను వెడఁగుడైన జననీ జనకుల్
విడుతురె పోషింపక; నీ
వుడఁగుము యీక్రూరబుద్ధి యెప్పుడు నాథా.

హిరణ్య— చండామార్కులారా! వీఁడు రాజకుమారుఁడని దండింపక, ముద్దులఁ బెంపకుఁడి. మీపాఠశాలలో నందఱు బాలురంబలె శిక్షించి చదువు గఱపుఁడీ.

చండామా— చిత్తము.

అనుబంధము—21.

(నిష్క్రమము.)



## తృ తీ య ర ం గ ము.



పాఠశాల.

ప్రహ్లాదుఁడు - చండామార్కులు - బడిపిల్లలు

విశ్వంభర, కుక్షింభర, దిగంబర, జీర్ణాంబర, జలాంబర

అశనాంబరులు.

అ ను బ ం ధ ము—22.

చండుఁడు— ఈపిల్లవారినిఁ గూర్చుండఁబెట్టుకొని వెనుకటి పాఠములెల్ల నొప్పగించుకొనిరమ్ము. నాకు నించుక పనియున్నది. ముగించుకొని వచ్చెదను.

అమార్కు— అన్నా! ఈపిల్లకాయలు దుర్మార్గులు, మొద్దులు, చదువునైన నించుకయేని నాస్తలేదు. నామాటవినరు.

చండ— నీమాటలువినక, దుర్మార్గము సేయువారిపేళ్లు వ్రాసి యుంపుము. నేవచ్చి వారిఁ దండించెద.

అమార్కు— మంచిది. అటులనే యొనరించెద.

(చండుఁడు నిష్క్రమించును.)

అమార్కు— ఓరీ విశ్వంభరా! వెనుకటిపాఠములు జ్ఞప్తిలో నున్నవియా?

విశ్వంభర— అయ్యా! అదియేమో? చదివిన పాఠములన్నియు, భద్రపఱచి పెట్టవలెనని యెంత యత్నించినను నెచటనో తప్పించుకొని పోవుచున్నవి. వానికేఁగాను వెదకి వెదకి వేసరితి.

అమార్కు— విశ్వంభరా! ఇపు డేమనియెదవు. వచ్చునందువా? రాదందువా?

విశ్వంభర— అయ్యా! ప్రాతఃకాలమునుండి వెదకి కొన్ని యక్షరములను బట్టికొని వచ్చితిని. మిగతవి దొరకినపుడు చెప్పెదను.

అమార్కు— ఏదీ! వచ్చినది చెప్పుము. "హేమమయ బ్రహ్మ" అను పనసలో నేమి వచ్చునో వచింపుము.

విశ్వంభర— ఆ! ఆపనసలోనో నిలండి. "అన్నమయ బ్రహ్మ" ఇది నిజము కాదండీ! భోజనమపు డిది జ్ఞప్తికి వచ్చెను.

అమాత్యు—బాగుగ వచ్చితివి. తిండిపోతా! నీకుఁ బాఠము రాదు.

విశ్వంభర—కాని లెండి. వచ్చినవాండ్లకు వచ్చు సామ్రాజ్యమేమి, నాకు రానిదేమి? నాతండ్రి కొల్లగ సంపాదించుచున్నాఁడు. అతఁడు పోయినమీఁదట నా సొమ్మంతయు నాదేను.

అమాత్యు—కుక్షింభరా! ఏదీ నీపాఠముఁ జెప్పుము.

కుక్షింభర—పోవయ్యా! ఏమిపాఠము. పాఠము పాఠ మని చంపుచున్నావు. అకురములులోగా నిండి యన్నమేపోదు. పూటకు మూఁడుసేరు లన్నముఁ దినువాఁడను. నేనిప్పుడు రెండుసేరులు మూఁడుపావులు నరపావు చటాకంతటి యన్నము దినుచున్నాను. నిన్న వైద్యునకుఁ జూపి యక్షురాజీర్ణమునకు మందు పుచ్చుకొంటిని.

అమాత్యు—అటులయిన నీకును బాఠము రాదు.

కుక్షింభర—ఈయక్షురాజీర్ణరోగము పోవునంతవఱకుఁ జదువు వలదని నావైద్యుఁడు పథ్యము పెట్టినాఁడు.

అమాత్యు—ఓరీ! దిగంబరా, పాకఘటమా, మందరికిరా, పాఠ మొప్పగింపుము.

దిగంబర—పోస్వామీ! మీరు దిద్దఁబెట్టిన యక్షరములు, కడుపులో నిలువనే నిలువవు. ఎంత బిగపట్టుకొనినను నిలువవు. దేహమెల్ల వ్యాపించి వెలికుబుకుచున్నవి. శరీరమంతట పొటమరించినటుల ఎటులు లేచినవో చూడుఁడీ. ఈకురుపులు గుణమగునంతవఱకు నేఁ జదువను, నాజోలికి మీరు రాకుఁడీ. ననుఁజంపినను నేఁజదువను.

అమాత్యు—ఓరీ! జీర్ణాంబరా! ఏదీ నీపాఠము.

జీర్ణాంబర—స్వామీ! నాగ్రహచారము. మీరేమి సేయుదురు? ఎంతో యంతఃకరుణతో, మీరు రెండుముక్కలు నాకు నేర్పుచున్నారు. ఆరెండుముక్కలు నోటిలోఁ బడిన తత్క్షణమే జీర్ణమై కంటికిఁ గానరాక పోవుచున్నవి. ఏమి సేయుదునండీ, ఏడ్పువచ్చుచున్నది. (ఏడ్చును.)

అమాత్యు—ఓరీ! ఏడ్చెద వేల, నీగ్రహచారమునకు నెవరేమి సేయుదురు. (జలాంబరునిఁజూచి) ఓరీ జలాంబరా! ఏదీ నీపాఠము.

లాంబర—పొండీ! ఏమిపాఠము. మీది యేమి యనిష్టపునోరో, మీవద్దఁ జదివిన

వారి కెవరికిఁ జదువు రాదు. ఎంతో యాస్థగ నేను జదువవలెనని ప్రయత్నపడి నను మీరు గఱపిన చదువంతయుఁ బ్రవాహములో పాఱిపోవుచున్నది.

అమాత్య—ఓరీ! అళనాంబరా! ఏదీ నీపాఠము.

అళనాంబర—ఏమండీ! పాఠమా? పాకమా?

అమాత్య—ఓరీ! తిండిపోతా, పాఠమనినఁ బాకమని మొదవా?

అళనాంబర—అయ్యా! నాకుఁ బాకము జ్ఞప్తిలో నుండినట్లు పాఠముండదు. పాక ముండినఁ జాలు. పఠ మెవరికిఁ గావలెను? స్వామీ! మిమ్ము నేనొకటి యడుగఁ దలంచితిని. కోపపడమనిన నడిగెద.

అమాత్య—అడుగుము. కోపమేల?

అళనాంబర—ఏమియు లేదు. మీకుఁ జదువు చక్కఁగ వచ్చును గదా? ఇంత చదు వేమి తిని నేర్చితిరి? మేము తినెడి యన్నము కాదా? మఱి యేమయినను దినుచుంటిరా?

అమాత్య—బుద్ధిలేనివాఁడా! నోరు మూసుకొని పడియుండుము.

అళనాంబర—చిత్తము (నోరుమూసికొనును.)

అమాత్య—ప్రహ్లాదా! ఏదీ నీపాఠము. సంవత్సరముగ నీవు నేర్చిన విద్యయొక్క సారాంశమును వచింపుము.

ప్రహ్లాదుఁడు—స్వామీ! మీరు నేర్పినవిద్య నామనమున నిలువదు. నాకు వచ్చినవిద్య మఱపునకు రాదు. నాచదువునందలి సారాంశ మేమన?

సీ. కేశవు గీర్తించు గీతము గీతము
    చక్రిగాథలుగల చరితచరిత
శ్రీహరి పదయుగ సేవనసేవన
    శ్రీవిభు నెఱిఁగెడు చింతచింత
కృష్ణుని నుతియించు గ్రీవము గ్రీవము
    సిరిజానికిని మ్రొక్కు శిరముశిరము
హరివిగ్రహము నంటుకరములు కరములు
    కమలాక్షుఁ గాంచెడు కనులుకనులు

గీ. సరసిజాంబకు నామము సంస్మరణస్మరణ
మాధవుని డెంద మందుంచు మనము మనము
పరమపురుషుని నర్చించు నరుఁడె నరుఁడు
చక్రితత్త్వము నెఱిఁగించు చదువు చదువు.

అమార్క—ఏమి ప్రహ్లాదా! ఇటు లనియెదవు. మేము కష్టపడి నీకు నేర్పినదెల్లను సముద్రమున కేతము గట్టిపెట్టితివి గదా. మీతండ్రి పిలిపించి ప్రశ్నించినచో నేమి పలికెదవు.

ప్రహ్లాదుఁడు—ఏమి పలుకుదునా? మీకుఁ దెలుపవలెనా?

క. విద్యలకు మూలదైవము
విద్యను నశియింపఁ జేయు విజ్ఞుఁడు హరి స
ర్వేశ్వరుఁడు మదిని నుండఁగ
విద్యలు చదువంగ నేల విబుధోత్తంసా.

(పిల్లవాండ్రు-ప్రహ్లాదుఁడు చక్కఁగ బుద్ధిచెప్పెను. అనుచుఁ జప్పట్లుగొట్టుచు "విద్యలు చదువంగ నేల విబుధోత్తంసా" యని యయ్యవారి మొగమును పాడుదురు.)

అమార్క—(స్వగతము) నాయత్నము మీఱినది. చండుఁడు వచ్చి యేమయినను జేసి కొననిమ్ము. ఈదుర్మార్గుల గుణములు నే సహింపలేను.

(నిష్క్రమించును.)

పిల్లవాండ్రు—హాయి యాయెను. (ప్రహ్లాదునిఁజూచి) ప్రహ్లాదా! నీవు పలికిన పలుకులు రుచ్యములుగ నున్నవి. నీచేఁ బలుకంబడిన హరివిద్య కష్టమా? సులభమా?

ప్రహ్లాద—బాలకులారా! చపల చిత్తులకుఁ గష్టము. స్థిరచిత్తులకు సులభము.

పిల్ల—సులభమనఁగ నొక సంవత్సరములో వచ్చునా?

ప్రహ్లాద—సంవత్సర మేల? ఒక గడియలోనే వచ్చును.

పిల్ల—అది వచ్చినపిదప మఱి యేవిద్యయు వలదా?

ప్రహ్లాద—ఏమియును వలదు. ఏమియును వలదు.

పిల్ల—అట్టులయిన నీపాదముల పైఁబడి వేఁడికొనియెదము. మాకును నావిద్య నేర్పుము.

ప్రహ్లాద—మీకిది పట్టుబడుట కష్టము. అయినను నాచేత నయినంతవఱకు మీకుఁదెలిపెద బాలకులారా! ఈశరీరము పంచభూతాత్మకమైనది. పృథివ్యప్తేజోవాయు రాకాశములను నవి పంచభూతములు. ఇవి యన్నియును సంయోగశక్తి బలంబునఁ జేరి శరీరమగును. ఇది మీకు నర్థమాయెను కదా!

పిల్ల—కాక యేమి. కుమ్మరవాని కుండవిధమున.

ప్రహ్లాద—ఆకుండను నిర్మించువాఁ డెవ్వఁడో యొకఁ డుండవలయును గదా?

పిల్ల—అవును, ఉండవలెను.

ప్రహ్లా—ఆ నిర్మించువాఁడే దైవము. ఆ దైవము పేరే హరి. ఆహరి తేజమే యాత్మ.

పిల్ల—ఆత్మ యను తేజ మెచట నుండును?

ప్రహ్లాద—బాలకులారా! మన శరీరము రెండువిధములుగ నుండును. కేవల పంచభూతాత్మకమయినది యొకటి. అందు నివసించు నాత్మయనెడు హరి తేజోమయ శరీర మొకటి. ఇల్లు కట్టువాఁడా యింట నివసింప నిచ్ఛయించునా? యిచ్ఛయింపఁడా?

పిల్ల—ఇచ్ఛయించును. బ్రహ్మాండమెల్ల నిండియుండు భూతకోటిలో నెల్ల హరి యుండునా?

ప్రహ్లా—హరి తేజముండును. సూర్యుఁ డొకఁడైనను, కిరణ రూపమ్ముల నుండు నతని తేజము సకల దిశలందు వ్యాపించియుండు రీతిని హరితేజం బఖిలచరాచరకోటిలోను వ్యాపించియుండును.

పిల్ల—నిజము. నిజము. అటులయిన మనకు నగపడు శరీర మొకటియు నగపడని యాత్మ యొకటియు మనకుఁ గలవు.

ప్రహ్లాద—నిజము. అయిన నారెంటిలో శరీరమస్థిరము. ఆత్మ స్థిరమైన తత్వము. శారీరాణువుల సంయోగబలము క్షీణించి వియోగము తటస్థించినపు డా పంచభూతసంబంధాణువులు చెదరి తమతమ స్థానములు చేరును. అటు చెదరిన శారీర సందిరంబు శిథిలమైనపు డాత్మ హరితేజంబునఁ జేరి మరల సమయము వచ్చినపుడు మఱియొక శారీర మందిరము చేరును. అయిన నిందొక విశేషమున్నది.

పిల్ల—అదియేమి?

ప్రహ్లా—పంచభూతాత్మకమైన యణువులు స్థూల సంబంధములు కావున వానిలో నప్పుడప్పు డితర స్థూలాణువులు కూడఁ జేరుచుండును. వానిచేరికచే నాత్మనా

చ్ఛాదించు కామ క్రోధ లోభ మోహ మద మత్సరాది గుణము లుద్భవిల్లును. బాలకులారా! మీకీ విషయంబు చక్కఁగ బోధపడినదో లేదో?

పిల్ల—ప్రహ్లాదా! చక్కఁగఁ దెలిసినది. సూర్యుని తేజమును మేఘము కప్పినటులకదా నీయర్థము.

ప్రహ్లా—నిజము. అటులనే. ఈ యరిషడ్వర్గము కప్పినపుడు, దేహాభిమాన అహంకార మమకార గుణములు పుట్టును. అహంకార మనఁగ నేను, ఇది నేను చేసితి ననుగర్వము మమకారమనఁగ నాది, యీయిల్లు నాది, యీవస్తువు నాది యను గర్వము. ఇట్టిగర్వములు చేరి హరితేజ రూపము గు నాత్మను గప్పి వేయును. ఆత్మ, సహజముగ స్థిరతత్వము కావున నేమియు వికారము నందక యుండును. మూస వుఁడు తనకు గనిలోఁ దొరకిన బంగారు జాతినిఁ జక్కఁగఁ గఱగించి శుద్ధిపఱచిన రీతిగ హరిధ్యాన తత్పరతచే శరీర సంబంధ కశ్మలమంతయుఁ గడిగినచో, ఆత్మ తన సహజకాంతినిఁ బ్రకాశించును. అరిషడ్వర్గ మను నహంకార మమకారములు శరీరమునం దుద్భవిల్లిన తోడనే ప్రకృతి సాంబంధిక గుణములు పుట్టును.

పిల్ల—ప్రహ్లాదా! ఆగుణము లెవ్వి?

హ్లాద—బాలకులారా! అవి సత్వరజస్తమో గుణములని మూఁడు. కేవల సత్వగుణము సాధువులసొమ్ము, అట్టి వారలుత్మను హెచ్చుగ వెలుఁగింపఁజేయుదురు.

—ప్రహ్లాదా! ఆత్మ స్థిరతత్వమని పలికితివే; దాని ప్రకాశమునకు హెచ్చుతగ్గు లెట్లు కల్గును.

ప్రహ్లాద—బాలకులారా! మీయందు జ్ఞాన మపుడే యంకురించుచున్నది. మీ రడుగు ప్రశ్న బుద్ధి కౌశల్యముగల వా రడుగునట్టిది. ఆత్మ స్థిరమైన తేజోరూప మను నది నిజము. ఆతేజమును, శరీర సంబంధ కల్మషంబుచే మాయక యాకల్మషం బును దొలఁగించినచో నాత్మ ప్రకాశము చక్కఁగ నగపడును.

—నిజము. అద్దమును సున్నముతో గడిగి తుడిచినపిదప కశ్మలముపోయి ప్రకాశము హెచ్చినటుల కదా?

హ్లాద—నిజము. అటులనే. అట్లు శుద్ధపఱచి శుద్ధపడిన యాత్మ తేజోరూపమునఁ బ్రకాశించును. అట్టి యాత్మగలవానికి సర్వంబును గరతలామలకంబుగ నుండును. ఇఁక రాజసగుణము ముఖ్యముగఁ గలవాఁ డెపుడో యించుక సాత్వికము

నపేక్షించును. అట్టివాని యాత్మ త్వరగ శుద్ధపడదు. కేవల తామస గుణ ప్రాధాన్యంబు తనలో వ్యాపించిన కల్మషమును శుద్ధిపఱుపక శరీరమే నిత్యమని నమ్మి, దారపుత్ర ధనేషణములను ఈషణాత్రయంబులకుం జిక్కి, పశుపక్షి మృగములం బలె సుదరపోషణము, కామాద్యనుభవములు, సుఖములని నమ్మి దాని [illegible] చేయుచుండును.

పిల్ల—ప్రహ్లాదా! అట్టి జ్ఞానము మన యుపాధ్యాయులు శ్రీ చేసెదో యుపదేశించుచున్నారే అదియేమి?

ప్రహ్లాద—బాలకులారా? సృష్ట్యాదిని శబ్దతత్త్వమే గ్రహణేను. అజ్ఞానిక ప్రపంచము రాజస తామసగుణాన్వితులగు మానవులచేతం బడి, భిన్నార్థములు పొందినదాయెను. భిన్నార్థములచేఁ దేవోమహైకస్వరూపుఁ డగు దైవమునకు భిన్న రూపము లున్నవని యూహలు లెన్నసాగిరి. అట్టి భేదబుద్ధి జనులయందుఁ గలిగి యనేక మదమత్సరములు బెరిగి, ద్వేషములు హెచ్చి, మూలాధారుఁడైన దైవమే లేడను నంతటి యనర్థములు కలిగెను. కావున మనగురువులు చెప్పు శబ్దవాదమును నర్థవాదముఁ బ్రహ్మోపాసనకు లైనవి కావు. నిష్ఫలమైనవి. మదమత్సరాదులను బెంచునవి. భేదబుద్ధి కలిగించునవి. దైవమునకు దూరమున నిడునవి కావున మీ రా జోలికిఁ బోకుఁడి. శ్రీహరిని భజింపుఁడి.

## అనుబంధము—23.

పిల్ల—ప్రహ్లాదా! నీవు బాలుఁడేయైనను, జ్ఞానివి. కావున మాపైఁ బ్రేమనించి, హరిధ్యాన క్రమము నెఱిఁగింపుము.

ప్రహ్లాద—బాలకులారా! హరిధ్యానము సులభము. ఎనిమిది యక్షరము లెల్ల కాలము మీ జిహ్వలో నుంచుకొని జపించుచుండుఁడి.

పిల్ల—ప్రహ్లాదా! అవియెవ్వి.

ప్రహ్లాద—పిల్లవాండ్ర చెవులలో నారాయణాష్టాక్షరి నుపదేశించును.

పిల్ల—హా! హా! హా! ఎంతమధురము. ఎంతమధురము.

ప్రహ్లాద—బాలకులారా! మీ రొనరించు ప్రతికర్మలయందును శ్రీహరిని శుద్ధ చేతస్కులై భజింపవలెను.

పిల్ల—శ్రీహరిని భజించుట దెటులు ?

ప్రహ్లాద—నేనవిన రీతి నుచ్చరించి, తదేక నిష్ఠులై ధ్యానించు చుండుడీ.

పిల్ల—కానిమ్ము.

ప్రహ్లాద. హరి హరి హరి హరి

హరి హరి హరి హరి

హరి హరి హరి హరి

హరి హరి హరి శ్రీ.

పిల్లలు—ఏమీ ? ఎంత సులభముగనున్నది. ఎంత సులలితముగ నున్నది.

(అనుచుఁ బిల్లవాండ్లందఱు హరిని ధ్యానించుచుఁ జిందులు ద్రొక్కుచుందురు. చండామార్కులు ప్రవేశము. వారినిఁ జుట్టుకొని బాలురు హరిభజన చేయుందురు. చండామార్కులు వారినిఁ దన్నుదురు. ఎంత తన్నినను భజనవదలక వారు భజన సేయుదురు.)

చండ—ఏమి ప్రహ్లాదా యీగద్దలము.

ప్రహ్లాద—స్వామీ ! హరిభజన.

చండ—దీనిని వీరికి నేర్పిన వా రెవరు ?

ప్రహ్లాద—హరి.

చండ—అతఁడు వచ్చి నేర్పెనా ?

ప్రహ్లాద—స్వామీ ! అతఁడు వచ్చుటయేమి. ఇచ్చటలేఁడా.

చండ—ఇచ్చట లేఁడుగదా ?

పిల్లవాండ్రు—ప్రహ్లాదునిఁ జూపి.

(హరి హరి యని భజింతురు.)

చండ—(అమార్కునిఁ జూచి) అనుజా ! మన ప్రయత్నమెల్లను బూడిదెలోని హోమంబయ్యెను. మనరాజు తనబాలున కేమి నేర్పితిరని యడిగిన నే నేమి సూచింతును. (పిల్లలనుఁజూచి)

చండ—రాక్షసబాలులారా ! మీకీ ప్రహ్లాదుఁడు చెడుబుద్ధిఁగఱపినాఁడు. మీ రా బుద్ధి

వదలఁడు. మన రాజు మాటలు వినిన మిము శిక్షించును. మేము గఱపిన చదువును జదువుఁడి.

పిల్లవాఁడొకఁడు—ఓరీ! మీరందఱూరకుండుఁడి. నేను వీరికి బదులు చెప్పెదను. (అయ్యవార్లనుఁజూచి) అయ్యవార్లా! మీకొక నమస్కారము. మీ చదువుకొక నమస్కారము.

గీ. పంచదారఁగ్రోలి పరఁగు పిపీలిక
యెటుల దానివదలి యితర హీన
వస్తువులను గోరు? వలదయ్య మీవిద్య
వాసుదేవు స్మరణ వదలమయ్య.

చండామార్కులు (ఒకరిమొగ మొకరుచూచికొని తలయూఁచి ప్రహ్లాదునిఁజూచి) ప్రహ్లాదా! నీవీ మతమును మానుము. పిల్లలకుఁ దండ్రియే దైవము. పైఁగ నీతండ్రి సర్వలోకారాధ్యుఁడగు దైవమయినాడు. వలదు నీకు దుర్బుద్ధి.

ప్రహ్లాద—(హరి హరి యనుచుఁ జెవులు మూసికొనును.)

చండ—అమార్కా! మన రాజున కీవార్త మనమేపోయి తెలుపుదము రమ్ము.

(నిష్క్రమణము.)



## చతుర్థరంగము.



### ఆస్థానము.

చండామార్కులు-హిరణ్యకశిపుఁడు-ప్రహ్లాదుఁడు-రాక్షసుఁడు.

చండుఁడు—దేవా! నీ కుమారుఁడు, తన మూర్ఖత విడువఁడు. తాఁ జెడినకోఁతి వనమెల్లఁ జెఱచెనను విధమున, బడిలోనుండు పిల్లవాండ్రందఱికి నేను చెప్పుదేమేమో బోధించినాడు. వారెల్లరును పిచ్చివారయి యెల్లకాలములందును నీవైరిని నుతించుచు భజించుచున్నవారు. కావున మునుమున్నే మా యశక్తతను మీకు నివేదింప వచ్చితిమి.

అమాత్య——దేవా! బాలురెల్లరా ప్రహ్లాదుని హరి యనిభావించి పూజించి భజించుచున్న
వారు. వలదనినను వానిని వెంబడించుచున్నవారు?

హిరణ్య——ఏమీ? ఏమీ? ప్రహ్లాదున కింకను, బుద్ధి వదలలేదా? ఏదీ వాని నిప
టికిఁ బిలిచికొని రండు.

అమాత్య——(ప్రహ్లాదునిఁ బిలిచికొనివచ్చును. బాలురు సైతము హరినామస్మరణ సేయుచు
వత్తురు.)

హిరణ్య——(ప్రహ్లాదునిఁ బట్టికొని) ఓరీమూఢా!

సీ. చక్రినామము నీవు స్మరియింతువే నీకుఁ
గాలానలమునందుఁ గాల్చివైతు
ప్రహ్లాద. ఘోరతాపత్రయ ఘోరానలముఁ గూల్చు
ఘనునకు నీవిడు ననలమెంత
హిరణ్య. శాతాననాగ్రీల హాలాహలముఁ దెచ్చి
గ్రోలఁగఁ జేయుచుఁ గూల్తు నిన్ను
ప్రహ్లాద. భవరోగవైద్యుండు బంధువై పాలింప
నీచాహి విషవహ్ని నెగడు నెటుల
హిరణ్య. శంబరాసురుఁబిల్చి శాంభవీ మాయలఁ
జిక్కించి చావంగఁ జేతునిన్ను
ప్రహ్లాద. ఇలమాయలన్ని పుట్టించిల్లుఁ గాఁగలవేల్పు
మాయలన్నియుఁ బాపి మనుచునన్ను
హిరణ్య. పన్నగ పాశానుబద్ధునిఁ జేయుచు
మున్నీటిలో నిన్ను ముంచివైతు
ప్రహ్లాద. జలధిశయానుఁడు జలజలోచనుఁ డుండ
జలరాశి నను ముంచఁదలఁచు నెటుల

హిరణ్య. పర్వతంబులు శిరముపైఁ బడఁగఁ ద్రోతు
ప్రహ్లాద. గుత్తి నిడికొని బ్రోచు నధోక్షజుండు
హిరణ్య. కొండ నెక్కించి త్రోతును కుతలమునకు
ప్రహ్లాద. దయను శ్రీహరి రక్షించుఁదండ్రి వినుము.

హిరణ్య—ఓరీ! ఉన్మాదా? అన్నిటికి నన్నే చెప్పి నన్నతిక్రమించి మాటలాడు చున్నావు. నీకంటిన రోగముఁ గుదుర్పు మరణమే మందని నే నెంచితి.

ప్రహ్లాద—జనకా! నాకంటిన ది రోగమని నీవు దలఁచితి వేని దానికి మందు నేనే తెలిపెదను వినుము.

సీ. సకల జన్మవ్యాధి హరణమ్ము సర్వపాప
శోషణము భక్తజన పరిపోషణమ్ము
ముక్తికాంతా శిరోరత్న భూషణమ్ము
హరిచరణమ్ము సతతసుసంస్మరణ మొందు.

నాయనా! నాకుఁ గలిగినది రోగమని నీవు దలఁచితి వేని, దాని నివారణకై హరిచరణారాధనయు, హరిస్మరణయు, హరిభజనయు జేయింపుము.

హిరణ్య—(కోపమునఁ బట్టి యల్లాడించుచు) బాలకా!

చ. విడువిడు కీడుమూడుపిను వెంగలివిత్తును నీచు నెన్నఁగా
జడుఁడవె నీవు? వాఁడు మనశత్రువు చంపెను పిన్నతండ్రినిన్
జడధిని దూరిడాఁగె ననిశంబును మాకహితంబు లెంచు మాయా
ధముఁడు మనకానివాని నెపుడున్ నుతియింపఁగ లజ్జపుట్టదే?

ప్రహ్లాదా! ఆనీచుని నామము నుడువకు. వ్యర్థముగ నాచేత నీవు ప్రాణంబులు విడువకు. ఆమాయాధముఁడు మనకు జన్మవైరి. నీ పినతండ్రిని క్రోడరూపమున వధించెను. మన కెల్లకాలమునందు నహితంబులు సేయుచుండును. తనకార్య సాధనమునై యెట్టి యమానుష కృత్యంబుల నైనను, జేయ లజ్జింపఁడు. మున్ను క్షీరసాగర మథన కాలమున స్త్రీవేషధారియయి యామాయావి మన పూర్వికుల సంహారించెను. అట్టి జన్మద్వేషిని నీవు నుతించుట యనర్హ్యము అట్టివాని స్తుతిం

చుట నీకు లాభ మెద్దియు లేదు. సేవకుని మానసము నొప్పించి యతనికి నీవు ద్వేషివయ్యెదవు.

ప్రహ్లా—జనకా! శ్రీహరి నయముననో, భయముననో, పోషించియో, సంహరించియో మనుజులకు మేలు సేయుచున్నవాఁడు. మన మందఱము నతని యాజ్ఞా నిబద్ధులము వాని వలననుండి కలుగు లాభం బెద్దియని యడిగితివి దానిని విని చెద వినుము.

సీ. జన్మ జరామృత్యు బాధాపహరణమ్ము
ఘోరారి షడ్వర్గ మారణమ్ము
గురుతర సద్గుణా భరణమ్ము ప్రాకృత
పాతక కర్మ నివారణమ్ము
విషయాది ఘోరాహి విషభూరి హరణమ్ము
తాపత్రయాంబుధి తారణమ్ము
భూరివిమోహాంధ కారార్క కిరణమ్ము
సర్వనిర్వాపక కారణమ్ము
గీ. పాపనాంచితముని నుత పారణమ్ము
ఆగమారామభవన విహారణమ్ము
కార్యకారణ సంయోగ కారణమ్ము
భూరి సుఖదము హరి పదోచ్చారణమ్ము.

తండ్రీ! మనుజునకు నింతకంటెను లాభమేమి కావలయును?

హిరణ్య—(కోపమున)

క. చంపెదను బాలకుని నను
కంప మొకింతయును గనక కాలుని కడకున్
బంపెదను వీని నిప్పుడె
తెంపరినై వీని కెవఁడు దిక్కుగ నిలుచున్.

ఓరీ దురాత్మా! ప్రహ్లాదా! నిన్నిపుడే చంప నియమించెద.

ప్రహ్లాద—తండ్రీ! ఇట్టి విభ్రాంతి నీకుఁ బుట్టెనేయని నే ననవరతము నిన్నుఁజూచి దుఃఖించుచున్నాను.

గీ. చంపువాఁ డెవండు చంపింపఁ బడు నెవ్వఁ
డేల జనక నీకు నిట్టి భ్రాంతి
జనికి మనికి మూల కారణుండు గ
హరియె కాదె వాని నరయవలదె.

హిరణ్య—(చండామార్కులంజూచి) చండామార్కులారా! ఈ చండాలుని నిపుడే నావద్దనుండి యీడ్చుకొని పోయి కృత్తి నుత్పత్తిఁజేసి దానికి బలి యియ్యుఁడు వెళ్లుఁడు వీనిముఖము జూచిన దురితములు వాటిల్లు.

(చండామార్కులు ప్రహ్లాదునిఁ బట్టికొనిపోదురు.)

ప్రహ్లాద:—అనుబంధము—24.

(నిష్క్రమింతురు.)



పంచమరంగము.



అరణ్యము.

చండామార్కులు - ప్రహ్లాదుఁడు - కృత్తి.

ప్రహ్లాద:—అనుబంధము—25.

(చండామార్కు లభిచార మొనర్చుచుందురు. ప్రహ్లాదుఁడు హరిభజన చేయుచు నిలిచియుండును) (అభిచార హోమకుండములోనుండి భీకర రూపము వహించి కను లెఱ్ఱఁజేసికొని, పండ్లు గిటుగిటుఁ గొఱుకుచు శూలముఁ ద్రిప్పుచు శక్తి యుద్భవిల్లి.)

కృత్తి—చండామార్కులారా! నన్నేల సృష్టించితిరి. ఇపుడు నే నెవరిని త్రుంపు దును ఎవరినిఁ జంపుదును.

చండామార్కులు—కృత్తీ! ఈప్రహ్లాదునిఁబట్టి చంపుము.

కృత్తి—(ప్రహ్లాదునిపైఁ బడ శూలముఁ ద్రిప్పివేయును.)

ప్రహ్లాద:—అనుబంధము—26.

క. చిత్తమున హరినిఁ దలఁచుచు
బత్తిని సేవించునట్టి భక్తునినంటన్
గృత్తికి సాధ్యమె యిప్పుడది
మొత్తంబునఁ గాల్చె జనులు మెచ్చఁగ నకటా.

(కృత్తి విసరిన శూలము తునకలై క్రిందఁబడును.)

కృత్తి—(చండామార్కులఁ జూచి) ఓరీ! చండాలులారా! హరిభక్తునిఁ జంప నభిచార హోమంబు సేయ నగునా? కావున నే, నాశంబుసు, వ్యర్థమాయెను. ఆహారంబులేక నేఁ బోఁజనదు. మిము నిపుడె మ్రింగెద. (చండామార్కులను దరిమికొని పోవును.

చండామార్కులు (మూలమూలల దుంకుచు విడి ప్రహ్లాదునిఁ జేరి) ప్రహ్లాదా! కాపాడుము. కాపాడుము. కృత్తి మముఁ జంపుచున్నది. (అడుగుల బైఁబడుదురు)

ప్రహ్లాదుఁడు—(హరికి మ్రొక్కి.)

గేయము. నిరంజనా నిరంతరా నిరస్తదోష సంచయా
నిరాశిషా నిరాకృతీ నిరామయా నిరంకుశా
హరాజవందితాఘనా హరీ నినున్ స్మరింతునే
సురేంద్ర సౌఖ్యదాత భూసురాళిభీతి మాన్పవే.

(కృత్తి యదృశ్యయగును.)

చండామార్కులు—ప్రహ్లాదా! నిజమగు దైవము నీవేను. నీమహిమఁ బొగడితిమేని నీతండ్రి మముఁ జంపును. నీమహిమఁ దెలియక యెన్నివిధములనో నిన్ను హింసించితిమి. వెక్కిరింపఁబోయి వెలికిలఁబడితిమి. ఇఁక నీజోలికి రాము. నీతండ్రికీ సమాచారముఁ దెలిపి వచ్చెదము రమ్ము.

ప్రహ్లాద:—అనుబంధము—27.

(నిష్క్రమము.)



# అష్టమరంగము.

---

## భవనము.

ప్రహ్లాదుఁడు-హిరణ్యకసిపుఁడు-చండామార్కులు-రాక్షసులు.

హిరణ్య—చండామార్కులారా! మీరెటులా ప్రహ్లాదుని శిక్షించితిరి? వాఁడు దాన వార్హమగు రాజనీతులు గఱచెనా?

చండుఁడు—దేవా! నీ కుమారునకు సమస్తనీతులు కరతలామలకములుగ నున్నవి. అయినను వాని జన్మమునకు నంటిన పిచ్చిమాత్రము వదలలేదు.

హిరణ్య—ఆపిచ్చి విడిపింపవలెనని కదా మీకు నప్పగించినది.

చండుఁడు—అది హెచ్చయినది.

హిరణ్య—(కోపమున) చండామార్కులారా! మీరు పేరునకు గురువులైతిరిగాని కార్యమున గురువులు కారైతిరి.

అనుబంధము—28.

చ. కులగురులంచునమ్మి పసికోలను శిక్షితుఁజేయనియ్యఁగా
కలుషముఁ బూని వానికినిఁ గాని గుణంబులు కొన్ని నేర్పి యీ
చెలువునఁ బెంచినారుగద చేటొనఁ గూడదె యింక మీకు;నా
చెలిమియు దూరమయ్యెఁ గులశీలములెల్లను గాలిపోయెఁగా.

చండామార్కులారా! ఇన్నిదినంబులు మిము రక్షించినది వ్యర్థమాయెను. కృత్తిని గల్పించి చంపుఁడని యాజ్ఞ యిడియుంటిని గదా. అటు చేయరైతిరేల?

చండామార్కులు—దేవా! అభిచారహోమ మొనర్చి కృత్తిని సృష్టించితిమిగాని యదియును వానియందు ఫలింపదయ్యె.

హిరణ్య—చండామార్కులారా! ఇట్టి యలీకములు నాయెదుటఁ బచరింపకుఁడి. తన కొడుకును జంపవలదని లీలావతి మీకు వేయయిన నాశ కల్పించియుండును. లేకేని పసిపిల్లకాయ కృత్తికి మీ కైననిన నెవ్వరునమ్ముదురు. (రాక్షసునిఁ జూచి) రాక్షసా! నీవుపోయి ప్రహ్లాదు నిచటికిఁ బిలిచికొనిరమ్ము.

రాక్షసుఁడు—చిత్తము.

హిరణ్య—చండామార్కులారా! నాసుతుని మీచేత నిడి, నేఁ జెడితిని. మీరిఁక వెళ్లుడీ.

(లీలావతికుమారునిఁ బిలిచికొనివచ్చును.)

హిరణ్య—లీలావతీ! నీవేల వచ్చితివి?

లీలావతి—మోహనాంగా! రాక్షసునిచే మీరు బాలునిఁ బిలిపించితిరి. ఊరక నేనా బాలునివెంట వచ్చితిని.

హిరణ్య—నిజము. నీ వాచరించు కర్మములన్నియును నే నెఱుంగుదును. పిల్లవానినిఁ జెడుప నెన్నిప్రయత్నములు గావలయునో యన్నియును నీవు సేయుచున్నావు. వాని దుడుకులు దాచెదవు.

లీలావతి—ప్రాణనాథా! నేనట్టిపని సేయుదాన నని మీరు తలఁచితిరా? ఏల యీ రిత్తయనుమానము?

హిరణ్య—(ప్రహ్లాదునిఁజూచి) ఓరీ ప్రహ్లాదా! నీ వేమి చదివితివి? సౌఖ్యసంపాదనకు నిజమగు నీతియెద్ది?

ప్రహ్లాదుఁడు—తండ్రీ!

చ. లలితసుఖాస్పదంబని యిలన్ గలజీవులు దారపుత్త్రి బం
ధుల తగులంబుఁ బెచ్చుఁగని నూతిని నుండెడు కప్పలన్ బలెన్
మిలమిలలాడుచున్ మనుచు మీఁదు నెఱుంగక యుంటికంటె ని
శ్చలవిధి మాధవున్ గొలిచి శాశ్వతసౌఖ్యము లందఁగా నగున్.

హిరణ్య—(కోపమున లీలావతింజూచి) లీలావతీ! చూచితివా, కొమారుని దౌష్ట్యము. నే వలదని యెన్నిమారు లొత్తియొత్తి చెప్పినను నా యవాచ్యుని పేరు నాయెదుట నెత్తి వానిని దైవమని నటించుచున్నాఁడు. (ప్రహ్లాదునిఁజూచి) ఓరీ ప్రహ్లాదా! సర్వజగములను నేను జయించితిని కావున జగదీశ్వరుఁడ నేనేను. జగదీశ్వరుఁడు నేను కావున నే సర్వారాధ్యుఁడ నైతిని. కావున నీవు నన్ను భజింపుము. నన్ను దైవముగ నమ్ముము.

ప్రహ్లాదు—జనకా! నిన్ను దైవమనినమ్మి భజింప హరికి కోపమురాదా?

సీ. క్షీరసాగర దుగ్ధ మారగింపక మేక
పాలుఁ గోరునె యెంత గోలమైన
మిహిరు తేజమునీక్షి మిణుగురు పురుగుల
చలిఁగాచికొన నౌనె వెలుఁగటంచు
శివజటా జూట సంభవమైన సలిలము
విడి పల్వలోదక మడుగనౌనె
దేవతా నైవేద్య పావనాహారంబుఁ
దినక పాసిన కూడుఁ దినఁగనౌనె

గీ. హరిని దురితేభహరిని దుఃఖాబ్ధిదరిని
డెందమున నిల్పి శాశ్వతానంద సుఖము
నందఁగోరక చంచలంబైన సుఖము
మానవుం డెటుకోరునో దానవేంద్ర.

అనుబంధము — 29.

హిరణ్య—(కోపమునలేచి, రాక్షసులంజూచి) మీరీ బాలునిఁ గొనిపోయి తక్షకుఁ
పిలిపించి వీనినిఁ గరపించి చంపుడి.

లీలావతి—(అడ్డమువచ్చి) మోహనాంగా! మన కడుపులోఁ బుట్టిన పసిపిల్లవాడు వీఁడుకదా? కొమారుఁడు పెడఁదోవ ద్రొక్కినపుడు జననీజనకులు నయ భయముల వానిని మంచిమార్గమునకుఁ ద్రిప్పవలెనుగాని చంపినఁ బ్రయోజనంబేమి. పుత్రఘాతుకులమను సడి మాయందు శాశ్వతముగ నిలుచును. కావున నీబాలుని నేమియు ననక యొకవత్సరము నావద్ద నుండనిండు. నేను మంచిమాటలచే వానిని మంచిమార్గమునకుఁ ద్రిప్పెద.

హిరణ్య—లీలావతీ! వాఁడు మంచిమార్గమునకు వచ్చువాఁడు కాఁడు. కులనాశకుఁడుగఁ బుట్టినాఁడు. అంగమునకుఁ బుట్టిన వ్రణము దేహమెల్ల వ్యాపింపకమున్నె తదంగ చ్ఛేదనచే గుణ పడు చినిటుల వీనినిఁ జంపి కుల ముద్ధరించుట నీతిమార్గ

ము అటుకాదేని చేటగును. వృక్షమునఁబుట్టిన యగ్నివృక్షము సమగ్రము గాల్చునుగదా ?

లీలావతి—మోహనాంగా ! మిము నే నెదురింప మాటలాడుదానను గాను. పుత్రప్రేమ నన్నింతటి సాహసంబునకు దించినది. కావున నొక వత్సరంబు నా బాలుఁడు నావద్దనుండ సెలవిండు.

హిరణ్య—లీలావతీ ! ఒకసంవత్సరములోపల నీవీ బాలుని మంచిమార్గమునకు ద్రిప్పవేని నీవే నీచేతులార నీబిడ్డనికి విషమిచ్చి చంపవలసివచ్చును చూడుము.

లీలావతి—కానిండు ప్రయత్నించెద.

హిరణ్య—అటులైనఁ బిలిచికొనిపొమ్ము.

(నిష్క్రమము.)



## షష్ఠమరంగము.



హిరణ్యకశిపుఁడు - లీలావతి - ప్రహ్లాదుఁడు.

హిరణ్య—(లీలావతినిఁజూచి) లీలావతీ ! నాకహోరాత్రము లీబాలునిచింతయే. మానసమునఁ గలంచుచుండును. వీనికిఁ బిచ్చి కుదుర్చుటకు మార్గము నాకుఁ జిక్కదాయెను. నీవీ సంవత్సరమంతయు శిక్షించితివికదా ? వాఁడేమయినను మార్గమునకు వచ్చెనా ?

లీలావతీ—మోహనాంగా ! నాసరసనుండు తఱివానికే పిచ్చియు నగపడదు. మీరు ప్రశ్నించినచో వాని కెన్నడును రాని పిచ్చివచ్చును. మీరు గద్దరించి మాటలాడుదురు. కావున వాని మానసము కలవళపడి పల్కును. సరసకుఁదీసి సరసముగ మాటలాడితిరేని చక్కఁగ ముద్దులొలుకుచు మాటలాడును.

హిరణ్య—అటులనా ? అటులయిన సరసముగా మాటలాడెద. (ప్రహ్లాదునిఁజూచి) ప్రహ్లాదా ! ఇటురమ్ము. (తొడమీదఁ గూర్చుండఁబెట్టుకొని) నాయనా ! ఇదియేమి ? నీచెవులలో నేమేమో యూకుఁ దూర్చినావు ? ఏమి యూకది ! చెవులునొప్పియా ?

ప్రహ్లాదుఁడు—నాయనా! అది తులసీదళము.

హిరణ్య—వీనులలో నేల దూర్చినావు?

ప్రహ్లాదుఁడు—తండ్రీ!

గీ. శ్రీదమై మించు శ్రీ తులసీదళమ్ము
సాదమై యొప్పు శ్రీ తులసీదళమ్ము
మోదమును నించు శ్రీ తులసీదళమ్ము
శ్రీదయితు మాల్యమా తులసీదళమ్ము.

హిరణ్య—(ప్రహ్లాదుని క్రిందికిద్రోసి) ఓరీ! చండాలా! నీవు హంతవ్యుఁడవు. (లీలావతిం జూచి) లీలావతీ! ద్రోహినీ! ఇదియేనా నీశిక్ష? బాగుగఁ బెంచితివి?

లీలావతి—మోహనాంగా! వాఁడే మొనరించెను? ఏమి యనెను?

హిరణ్య—లీలావతీ! నీవు వానితోఁగూడి నా విరోధిపక్షమవలంబించినట్లు నాకుఁ దోఁచుచున్నది. మీ రిరువురు వధార్హులు.

లీలావతి—నాథా! నా నేరమేమి? ఈబాలుఁ డొనరించిన నేరమేమి?

హిరణ్య—మరల నడిగెదా? నీకు వీనులులేవా?

లీలావతి—వీనులలోఁ దులసి యుంచినానని పలికెను.

హిరణ్య—లీలావతీ! ఎవరి మాల్యమని పలికెను?

లీలావతి—నాయనా! ఎవరి మాల్యమని పలికితివి?

ప్రహ్లాద—తల్లీ! "శ్రీదయితు మాల్యమా. తులసీదళమ్ము" అని పల్కితిని.

హిరణ్య—లీలావతీ! ఇపుడయినను వింటివియా?

లీలావతి—ఏమో వానికా పిచ్చియంటినది.

హిరణ్య—కావుననే వాఁడు, కులకంటకుఁడుగ భువిమని యుంటతగదు.

లీలావతి—మోహనాంగా! కని పెంచినవారు కటికలైన గతియేమి?

హిరణ్య—లీలావతీ! వీఁడు హంతవ్యుఁడు (ప్రహ్లాదునిఁజూచి) ఓరీ! ప్రహ్లాదా? ఆ నీచుని నామస్మరణయు ఆనీచుని ధ్యానము ఆ యవాచ్యుని యర్చన నీవు వదలెదవా? వదలవా?

ప్రహ్లాదు—జనకా !

చ. కనుఁగవచే ఫలంబె కనకాంచిత చేలునిఁ గానమేనియుణ్ ?
వినఁజెవులుండనేమి వితె వెన్ను నిగాథలు విన్కయుండినణ్ ?
మనఁగఁ బ్రయోజనంబె యిల మాధవు పూజలు సల్పమేని? యో
జనక హరిణ్ సదాకనని జన్మము జన్మమె జీవరాశికిణ్.

హిరణ్య.—ఓరీ చండాలుఁడా ! కంటికి నగపడక కాలికి బుద్ధిసెప్పి, డాఁగినవానిని నీచునిఁ బెద్దఁజేసి దైవమని తలఁచుటకు నీకు బుద్ధిలేదా ? పిటికి నీచునిఁబెంచి పెద్దచేయకు.

ప్రహ్లాదుఁడు—తండ్రీ ! ఆ హారినిగుఱించి నీవు దుర్భాషలు పలుకకు. ఫలమేమియుఁ గానక, పాతకమునకు, నొడిగట్టకుము. భువినిఁ బుట్టిన భూతకోటిలోఁ బురుష జన్మంబు శ్రేష్ఠము. అట్టి జన్మమెత్తియు నీవింతటి వ్యామోహాంధకారమునఁ బడుట యపేక్షణీయము కాదు. ఆహరి యవ్యయుఁడు. అచ్యుతుఁడు. ఆనంద మూర్తి, నిరంజనుఁడు, నిరామయుఁడు.

సీ. పెంచును నొకతఱి బెద్దఁగా బ్రహ్మాండ
    మెల్లను వెలనిడి చల్లఁగాను
ఉంచును నొకతఱి నుదరంబు లోపల
    నీ చరా చర కోటినెల్ల జనక
కాంచుఁ దానొకతఱి గర్భంబులోపలఁ
    జగంబులెల్లను దేటఁగాను
ముంచుఁ దానొకతఱి మున్నీటిలోపలఁ
    బ్రాపంచకమునెల్లఁ బ్రబలుఁడగుచు
గీ. పూతరూపమునందుచుఁ బూజ్యుఁడగును
దివ్యవిగ్రహుఁడయి తాను దేజరిల్లు
ఆది మధ్యాంతరహితుఁడై యఖిలమగుచు
బ్రకృతి వికృతుల రెంటికిఁ బగుఁడునగును.

నాయనా! ఇట్టి మహిమోన్నతుఁడయిన పరమేశ్వరుని దూషించి, దూషించి, దురితార్ణవంబునఁ బడి పోలెదవేల.

హిరణ్య—(ప్రహ్లాదునిఁబట్టి వంచును)

అనుబంధము — 30.

లీలావతి—మోహనాంగా! బాలునిపైఁ గోపమేల? వదలుఁడి. విడుఁడి వేఁడెద.

అనుబంధము — 31.

హిరణ్య—లీలావతీ! వీనికీ దుర్బుద్ధి యుద్భవమగుటకు నీగర్భము ముఖ్యకారణము. నీవీ బాలునకు దుర్గుణంబులు బోధించి పెంచినావు. కావున నీవు మున్ను మాట యిచ్చిన రీతిని నీబాలునకు నీవే విషమిచ్చి చంపవలెను. చంపవలెను.

లీలావతి—ఏమి నాథా! నాబాలునకు, నాముద్దు బాలునకు నేను విషముఁ ద్రావించి చంపవలెనా?

హిరణ్య—నిజము. నీవు నీచేతులార నీబాలునకు విషము హాలాహలము, తక్షక దంష్ట్రాగ్రానల విషము, గ్రోలనిచ్చి చంపవలెను. ఇదిగో యిపుడే నేఁబోయి విషము దెచ్చెద.

లీలావతి—హా! హా! ననుఁబోలు నిర్భాగ్య యీప్రపంచంబున నెవరును లేరు. అయ్యో! లేక లేక కన్న నోములునోచి, యేకారి, కన్నవారికాళ్లు బట్టుకొని, కనిన, నాముద్దులకుమారుని మారసమాకారుని, నవమాసములు గర్భమునధరించి, ప్రసవ వేదనలను సహించి, కనిన సూనుని, మాతృ మానసామోద ప్రసూనునిఁ జంపవలెనుగదా? ఎటుచంపుదును? నాయనా! పాలుద్రావుము రమ్మని పిలతునా? తండ్రీ! అప్పచ్చి యిత్తును రమ్మని పిలుతునా? ఏమనిపిలుతును? నాయనా! విషమిచ్చెదను రమ్మని తల్లినగు నే నెటుపిలుతును? తండ్రీ! కష్టపడి కనుఱెప్పమూయక, రేయింబవలు నినుఁగాచి, కలమాన్న భక్ష్యపాయసాది మృష్టాన్నంబులు భుజింపనిచ్చి, కండ తక్కువఁగా నటులఁ బెంచినది నిన్నదినంబున, విషమిచ్చి చంపుటకేనా? అయ్యోతండ్రీ! నీజనకుని మతమునకు విరుద్ధమగుమతము నీవేల యవలంబించితివి? ఒకవేళ నవలంబించితివో, అది మానసంబున నేదాఁపక నీవేల వెలిపెట్టి నీతండ్రిని ధిక్కరించితివి?

సీ. కడుపున నిడికొని కాచితిఁ గొన్నాళ్లు
కొడుక విషంబిడి గొంతుగోయ
వసపాలయుగ్గును పసగా నొసంగితి
దనయ విసంబిడి వసరఁ జేయ
పరమప్రీతిని నీకుఁ బాయస మిడితిని
బసికూన విసమిచ్చి యసుసుదోప
అన్న వస్త్రము లిడి చెన్నుగఁ బెంచితి
చిరుత యా విషమిచ్చి చెన్ను చెరుప

గీ. అన్న ప్రహ్లాద రావన్న యమితమోద
సన్నుతంబని విషమిచ్చి చంపఁదలచు
కటికయగు తల్లిఁ జేరుమా కరుణమాని
విసము నీకిత్తుఁ గ్రోలుమా వెసఁగుమార.

ప్రహ్లాదుఁడు—తల్లీ నీవేల దుఃఖించెదవు? నీ సంపూర్ణాంతః కరుణ పూర్వకముగ దీవెనలిచ్చి నీచేతులార నిచ్చిన విషమా హరిస్మరణాభి మహిమాతిశయమున నమృతమగును నమ్ముము.

సీ. వహ్నికీలల పాలి వారుణ మంత్రమ్ము
హరిదివ్యచరణ సంస్మరణమమ్మ
కామోదరావళి గారుడ మంత్రమ్ము
హరిదివ్యచరణ సంస్మరణమమ్మ
పాథోధిజృంభణ బడబాగ్ని మంత్రమ్ము
హరిదివ్యచరణ సంస్మరణమమ్మ
కిరికరి వితతకిఁ గేసరీ మంత్రమ్ము
హరిదివ్యచరణ సంస్మరణమమ్మ

గీ. దురిత దుఃఖార్తిఁ బోఁదట్టు పరమమంత్ర
మంతరాయులఁ బడఁగొట్టునట్టి మంత్ర
మఖిల భవరోగ పరిహారమైన మంత్ర
మమ్మ! హరినామ దివ్యమంత్రము! జనని.

ఇట్టి మహిమాతిశయముల హరినామస్మరణ నన్ను సదాకాలముఁ గాపాడుచుండ విషము విషమయి నన్ను బాధించునా? వలదీ వ్యసనము.

హిరణ్య—(చేత విషపూరిత పాత్రఁదెచ్చి లీలావతీ! ఇదిగో విషము. దీని నీ చండాలున కిచ్చి చంపుము.

(లీలావతి యూరకుండును.)

లీలావతీ! చేతనంటుము. ఆ చండాలునినోటిలో, నీచేతులారఁ ద్రావింపుము. లేనిచో నీకంటియెదుట సంహరించి పిదప నిన్నుఁ జంపెద.

ప్రహ్లాద—తల్లీ! ధైర్యముపూనుము విషమిమ్ము త్రావెద. ఆవిషము నే, విషాలయుని విషధరశయానుని, విషధరాశనవాహనుని, పాదతీర్థమని నమ్మి త్రావెద.'

గీ. అర్థి జనతార్తి పరిహారమైన జలము
ఆశ్రితాళికి నమృతమ్మునైన జలము
గాఢయమపత్రయాగ్ని బోకార్చుజలము
దివ్యమై యొప్పు హరిపాద తీర్థజలము.

తల్లీ! నీ విడువిషము హరిపాదతీర్థమని నమ్మి నే సేవించెద. నీ కేభయమున వలదు.

హిరణ్య—లీలావతీ! దుష్టచారిణి, దురాధర్షిణీ! విషముఁ ద్రావించెదవా? లేదా?

లీలావతి—(విషము నందికొని)

సీ. జననలగ్నముఁజూచి మనును దీర్ఘాయువై
యనిన పెద్దలమాట యనృతమయ్యె
సాముద్రికముఁజూచి సార్వభౌమ పదంబుఁ
గలుగునన్న హితోక్తి కల్లయయ్యె

నిలువునీటనుఁజూచి కుల ముద్ధరింపఁగఁ
జాలువాఁడనుమాట కూలనయ్యె
వృద్ధాప్యమున నన్ను నుద్ధరింపఁగఁ జాలు
సుతుఁడు నీవనుమాట సున్నయయ్యె

గీ. బాల సద్గుణశీల శుభాలవాల
యెటుల విషమిత్తునీకు నే నెటులనోర్తు
కటికకైనను నింతటి కార్యమగునె
కన్నతల్లిని నేఁగాగ కన్నతండ్రి.

ప్రహ్లాదా ! నీకు నాచేతులార విషమియ్యజాలను.

అనుబంధము—32.

అనుబంధము—33.

హిరణ్య—ఓసీ కులటా ! నామాట మీరెదవా ?

లీలావతి—దైవమా ! ఈకష్టాంబుధినుండి నన్నుఁ దరింపఁజేయవా ? నాదారి నేఁ జూచికొనవలసినదేనా ? మంచిది. శిరీష కుసుమంబు కంటె మెత్తనగు నాచిత్తమును గఠిన పాషాణమునకంటెను కాఠిన్యముఁ జేసికొని నాపుత్రరత్నమునకుఁ బాలుఁ ద్రావించిన విధమున విషముఁ ద్రావించెద. (ప్రహ్లాదునిఁజూచి) రావయ్యా ! పుత్రరత్నమా ! నీతండ్రి, నిన్నుఁగన్నతండ్రి, నినుఁజంప, నిన్ను నిర్నామునిఁజేసి తనకులమునుఁ గాపాడఁదలంచి విషమిచ్చినాఁడు. చిన్ననాఁడు నీకుఁ బాలు ద్రావించిన విధమున నేఁడు నీతల్లి నీకన్నతల్లి నిన్ను తొడమీదఁ బరుండఁ బెట్టుకొని విషమిచ్చును.

సీ. పతిహితవ్రతనయి పరగితి నేనియు
విసమమృతంబయి యెసఁగుగాత
పతియే దైవంబని భావింతు నేనియు
విసమమృతంబయి యెసఁగుగాత

పతికి మారాడక పరిభవించితి నేని
విసమమృతంబయి మొసఁగుగాత
పతిని నెత్తఱి నేను భజియించి మనుదేని
విసమమృతంబయి యొసఁగుగాత
గీ. పతియె పరదైవమనుచును భావమునను
దలతు నేనియు విషమమృతంబు నగుచు
సుతుని ప్రాణము రక్షించి సులలితముగ
నపగతవిషాదుఁ జేయు బ్రహ్లాదునిపుడు.

(అనుచుఁ బ్రహ్లాదునినోట విషముఁబోసి మిగత విషముఁ దాను ద్రావి మూర్ఛిల్లి పడును.)

ప్రహ్లాదుఁడు (విషమునుఁ ద్రావి, లేచి. చిందులుద్రొక్కుచు.)

వృ. జలధిశయానా! జలజలోచనా! జలజాల యహ్హ్రాన్మోదనా
జలధినిధానా! జలభవాననా! జలజాసన సంభావనా
కలలవగానా! కలుషమోచనా! కమనీయకళాఖేలనా!
ఖలజనదానా! ఖగసువాహనా! కలితాశ్రిత సంజీవనా!
(అనుచుఁ చిందులుద్రొక్కుచు.)

లీలావతి—(లేచి) నాయనా! నాచే విషము నీపాలి యమృతంబయ్యెనా? అని కౌఁగలించుకొనును.)

ప్రహ్లాదుడు—తల్లీ! రక్షింప హరి యున్నవాఁడు.

హిరణ్య—(పండ్లుకొఱుకుచు) నీవేమో యింద్రజాలవిద్య నలిపి విషమునందలి ప్రాణాపహారక గుణమ్మునుఁ బోకార్చితివి.
వీనికి రాయి వీపునఁగట్టి మున్నీటఁ ద్రోయించెద.

ప్రహ్లాద—తండ్రీ! హరితత్వమెఱుంగక చెడుచున్నావు, హరి విద్వేష మెవరికిన్నిఁ గూడదు. హరియే దైవమని పూజింపుము.

సీ. శ్రీలోలు చరణ సంసేవ సేయనివాని
కరము భీభత్సకా కరము గాదె

కంజాయతాక్షునిఁ గానఁగా నొల్లని
కనుఁగవ వెఱ బొమ్మకనులు గావె
నారాయణునినామ పారాయణము సేయ
నరయని జిహ్వాగహ్వరముగాదె
మాధవ విగ్రహారాధన వదలు మా
నవ శరీరము తుచ్ఛశవముగాదె

గీ. శ్రీరమాకాంతు ధ్యానంబు సేయ నేర
నట్టిజన్మము పశుజన్మమగును గాదె
హరి హరీ యననిట్టి యన్నరుఁడు భువిని
మనిన పీనుఁగుఁగాదె యో జనక వినుమ.

తండ్రీ! కావున నీవు హరినామధ్యానంబున నీ దురితంబులఁ బోఁగొట్టికొనుము.

హిరణ్య—ఓరీశంబరా (యని యఱచును)

శంబరుఁడు—దేవా వచ్చితిని.

హిరణ్య—ఈద్రోహినిఁ గొనిపోయి యతిభారమయిన పాషాణంబు వీని వీపునఁగట్టి సముద్రములోఁ ద్రోయుము.

శంబరుఁడు—చిత్తము. (ప్రహ్లాదు నీడ్చుకొని పోవును)

అనుబంధము—34.

(నిష్క్రమము.)



---

* ఇది 21 ఛందములోని 636378వ జలజలోచన యను నూతన వృత్తము.
6_12 యతి
భ య స స స స = గణములు

# ప్రహ్లాదనాటకము.

## తృతీయాంకము — ప్రథమరంగము.

[సముద్రము, రాక్షసులు, ప్రహ్లాదుఁడు.]

అనుబంధము—35.

రాక్షసులు ప్రహ్లాదుని వీపున రాయికట్టి మూటఁగఁగట్టి
సముద్రమున వైతురు.

రాక్షసుఁడు-1—ఓరీ మునిఁగిపోయెను.

రాక్షసుఁడు-2—ఈవార్త మనదైవమునకుఁ దెలుపుదము రమ్ము.

(రాక్షసులు నిష్క్రమింతురు.)

ప్రహ్లాదుఁడు—(తీరముఁజేరి)

గేయము. జలధిశయానుని నేను మది
తలఁచినఁ బోషణ సేయును నన్ను
ఖలగణహార్తను నేను మది
నిలుపుచుఁ గొల్చెద నిరంతరమ్ము.

అనుబంధము—36.

(నిష్క్రమింతురు.)

## ద్వి తీ య ర ం గ ము.



### భ వ న ము.

[హిరణ్యకసిపుఁడు, లీలావతి, రాక్షసులు, ప్రహ్లాద.]

**లీలావతి**—ప్రాణనాథా! నాసూనిని వెంట నన్నును జలనిధిలోఁ ద్రోయింపనైతి వేల?

కం. గారాముల కొమరుని నిటు
రారాములఁ బెట్టి యంబురాశినిఁ ద్రోయన్
బోరామి లేకపోయెనె
హా రాజితరాజతేజ హా సుకుమారా.

(రాక్షసులు ప్రవేశింతురు.)

**రాక్షస-1**—దేవా! తమపుత్రునిఁ గొనిపోయి గొప్పతాతిని వీఁపునఁగట్టి సంచిలోవేసి కూర్చి, కొండపైనుండిసముద్ర మధ్యమునఁ ద్రోసితిమి.

**లీలా:**—(ఏడ్చుచు) కం. నినుఁబెంచి పెద్దఁజేసితిఁ
దనయా నీతండ్రి కఠినతముఁడయి యిటులన్
వనధినిఁ ద్రోయుచుఁ జంపెనె
యనవరతామోద, శుభద, "హాప్రహ్లాదా."

(ప్రహ్లాదుఁడు ప్రవేశించుచు.)

**ప్రహ్లాద**—అమ్మా! వచ్చితిని. వచ్చితిని.

గేయము. మన కేమిభయమమ్మ జననీ ఆ
వనజాయతాక్షుని ఘనరక్షయుండ
జలరాశిభయమేల జననీ ఆ
జలధి శయానుఁడు సరసను నుండ.

(లీలావతి లేచి కౌఁగలించుకొనును.)

హిరణ్య—(కోపమున లేచి) ఓరీ! చండాలా! నిజమాడి ప్రాణ మొకగడియయైనఁ గాపాడికొనుము. నీపై దయఁదలఁచి యీ రాక్షసాధములు నిన్ను మున్నీటిలోముంపక రక్షించిరికదా?

ప్రహ్లాద—తండ్రీ! నీభటులు నన్ను హింసలఁబెట్టి కట్టి సముద్రమునఁ బడవైచిరి. శ్రీహరి నన్ను రక్షించెను.

హిరణ్య—(ప్రహ్లాదునిఁదన్ని) ఆమాటయాడకు. వాఁ డెచట నుండునది నాకుఁ జూపుము. నీకంటియెదుట నే చంపెద.

ప్రహ్లాద—తండ్రీ! శ్రీహరి తేజోమయానంద రూపుఁడు. నీవు కేవల తామసగుణ ప్రాధాన్యుఁడు. కావున నీకెటు గోచరుండగును.

గీ. అంధకారంబులోనున్న యట్టివరుఁడు
పరుని గనలేనివిధమున నురువి మోహ
పాశములఁ జిక్కువడి పొర్లు క్లేశవశుఁడు
యఘవిచారుఁడు కాంచునే హరినితండ్రీ.

హిరణ్య—ఓరీ చండాలా! నీమాయలమాట లికఁ జాలింపుము. నీవు చిన్నతనమున నా కలహాముని సరసఁ బెఱుగుకాలమున వాఁడు నీకు జలస్థంభవిద్యను నేర్పెను కాఁబోలు ఈతూరి నిన్ను బాములచేఁ గఱపించిచంపెద. (ఓరీ రాక్షసులారా) వీనిని గొనిపోయి త్రాచుపాములచే గఱపించి చంపుఁడు?

రాక్షసులు—చిత్తము (అనుచుఁ బ్రహ్లాదుని నీడ్చుకొని పోవుదురు)

ప్రహ్లాదు—(హరినామకృతి పాడిపోవును)

అ ను బం ధ ము — 37.

(నిష్క్రమము.)



## తృతీయరంగము.



### అరణ్యము.

[పాములవాఁడు, ప్రహ్లాదుఁడు, రాక్షసులు.]

(పాములవాఁడు నాగస్వరము వాయించుచుండును.)

ప్రహ్లా. ఉ. వీనన వీనవాహన పవిత్ర చరిత్ర రమారమా హరీ
దానవదాన దీనజన తాఘన కామితదాన శ్రీహరీ
మానిజనావనా మహితమానధ నామహిమాను బోధనా
మానసమాన నిల్వవె రమాధవ మాధవ నిన్ను నమ్మితిన్.

(హరిస్తుతి చేయుచు నిలిచియుండ నొక గొప్పపాము ఫూత్కరించుచు వచ్చును. అంతట వైనతేయుఁడు సాక్షాత్కరించి సర్పమును దన్నుకొనిపోవును. రాక్షసులు పఱుగిడిపోదురు.)

అనుబంధము — 38.

(విష్కంభము.)



## చతుర్థరంగము.



### భవనము.

[హిరణ్యాకసిపుఁడు, ప్రహ్లాదుఁడు, రాక్షసులు, లీలావతి, శంబరుఁడు.]

హిరణ్యా—లీలావతీ ! యేడ్పు చాలింపుము. నీమాటలు నావీనులకు సూది పోటులుగనున్నవి. కులకంటకుఁడగు బాలుఁ డుండి ప్రయోజనంబేమి ? పిన్నతనము నుండి పాలుఁ ద్రావించి ముద్దుగఁ బామునుఁ బెంచినచోఁ బెద్దపెఱిగి పాము, పెంచినవానినిఁ గఱవకుండునా? దుష్టశిక్ష చేయుటయు, రాజాజ్ఞానీతి. దుష్టుఁడు పరుఁడైననేమి ? సుతుఁడైననేమి ?

లీలావతి—మోహనాంగా! నాబాలునియందే తప్పు మీ రారోపింతురు. మీవైరి సేవానిరతుఁడనియెడి యొకతప్పుఁగాదా? అది తప్పని మీరు తలఁచునెడల మీతండ్రి కశ్యపుఁ డహోరాత్రములందును మీవైరిని ధ్యానించుచు సదాకాలము సేవించుచు నతనికై తపంబు లాచరించుచు నుండునుగదా? అతనిని దండింపరాదా?

హిరణ్య—అతఁడు ముదిరిన ముదసలియై చేఁతలేదో యనునంతటి స్థితిలోనున్న వాఁడు కావున క్షమించినాను. అటుకాదేని యీనాఁడే యతనినిఁబట్టి చీల్చుచుంటిని.

(రాక్షసులప్రవేశము.)

రాక్షస—దేవా! తమ కుమారునిఁ ద్రాచుపాముచే గఱపించుతఱి నెచ్చటినుండియో గరుత్మంతుఁడు పామును దన్నికొనిపోయెను. నీసుతుని ముప్పుఁదప్పెను.

హిరణ్య—(కోపమున) ఓరీ శంబరా! ఓరీ శంబరా (అఱచును.)

శంబరు—దేవా! వచ్చితి. పిలిపించిన కారణం బేమి.

హిరణ్య—శంబరా! నీ విపుడే వెళ్లి గరుడలోకంబుఁ బ్రవేశించి యాగరుఁడునిఁబట్టి శిక్షింపుము.

శంబరుఁడు—చిత్తము.

(నిష్క్రమించును.)

(ప్రహ్లాదుని ప్రవేశము.)

ప్రహ్లాదుఁడు-గేయము. భయమేల నలదమ్మ జననీ భవ
భయపరిహారుఁడు హరియుండ మనకు
ఉరగాశనవాహనుని మది
దురితాపహారిని హరినీ భజింతు.

హిరణ్య—(కోపమునలేచి) ఓరీ! ఆనీచపదము నా సరస నుచ్చరింపకు. వాఁడుండిన నాకుఁ జూపుము.

ప్రహ్లాద—తండ్రీ! మాయచేఁ గప్పంబడిన నీస్థూల చక్షువులకు నా హరి యగపడునా! జపతపస్స్వాధ్యాయ నిరతుఁడై నిరంతరముఁ దపించుచు హరినామస్మరణ చేయుదువేని నా మహామహుఁడు గోచరుఁడగును.

క. మాయక దునుముచుఁ జూచిన
నా యచ్యుతుఁ డుండునయ్య యన్నిటి లోనన్
నాయందు నుండు హరియే
నీయందును నుండుఁగాదె నిజముగఁ దండ్రీ.

హిరణ్య—ఆ ! ఆ ! దురాత్మా! నిజము ఆనీచుఁడు నీయందునుండును, నాయందునుండును, కప్పయందుండును, చిలుకయందుండును, కుప్పయందుండును, నిప్పులో నైతముండును. కావున నిన్నిపుడే యగ్నిలోవైచి కాల్చి భస్మముచేసి యానీచునియందుఁ జేర్చెద. (ఓరీ రాక్షసా)

అనుబంధము — 39.

రాక్షసు—స్వామీ ! చిత్తము.

హిరణ్య—ఓరీ రాక్షసులారా ! ఈదురాత్మునిఁ గొనిపోయి ప్రళయాగ్నినిఁ బ్రజ్వాలింపఁజేసి వీనిని దానిలోఁ ద్రోసి భస్మముచేయుఁడు. కొనిపొండు నాయెదుట నుంపకుఁడు.

రాక్షస—ప్రహ్లాదునిఁ బిలిచికొనిపొండు.

ప్రహ్లాదుఁడు—(కృతిపాడి వెళును.)

అనుబంధము — 40.

(నిష్క్రమము.)



పంచమరంగము.



అరణ్యము.

రాక్షసులు, ప్రహ్లాదుఁడు.

అనుబంధము — 41.

రాక్షసులు—(వహ్నిగుండములోని మంటలు ప్రజ్వలింపఁ జేయుచుందురు.)

ప్రహ్లాదుఁడు—(కేలుజోడించి ఫాలితలంబునఁ జేర్చి.)

గేయములు. దేవాధిదేవ, యాదిదేవా మహాదేవ సేవించువాఁడను కా
వావే, పాడెద నిను వేఁడెద

వందారు మందార వందిత సురవర నందిత మునివార
పాడెద నినువేఁడెద

ధీరా పరాత్పరవేరా శుభంకర వారాశి మందిరబ్రోవరా
పాడెద నినువేఁడెద.

రాక్షసులు—ప్రహ్లాదునిఁబట్టి యగ్నిలోఁ ద్రోయుదురు. వెంటనే యురుము లురిమి వాన వచ్చును.

(నిష్క్రమము.)



## షష్ఠమరంగము.



### భవనము.

హిరణ్యకసిపుఁడు, రాక్షసులు, ప్రహ్లాదుఁడు, శంబరుఁడు.

హిరణ్య—ఓరీ రాక్షసులారా! మీమాట నిజమని నే నమ్మను.

రాక్షసులు—దేవా! మే ముజ్వలింపఁజేసిన యగ్నిజ్వాలలోఁ బడిన క్షణమున నేవలాహకంబులు మదద్విపానేకంబులై కుంభద్రోణముగఁ గురియసాగెను. పిడుగులవడికి నిలువఁ గడిమిఁ జాలక పఱుగిడి వచ్చితిమి.

హిరణ్య—ఓరీ శంబరా! నీవు వడిగఁబోయి, వరుణదేవేంద్రులను బట్టికొని రమ్ము. వారు గర్వించి నాయాజ్ఞకు విరుద్ధమగు కార్యములు సెఱుపుచున్నవారు వారిని శిక్షించెద.

శంబరుఁడు—చిత్తము.

(నిష్క్రమము.)

(ప్రహ్లాదుని ప్రవేశము.)

హరినామస్మరణ సారము భూరి
దురితానలమేఘా సారము భువినీ
భవరోగౌషధ సారము శ్రీమా
ధవుపాద దివ్యాంబు సారము భువినీ.

హిరణ్య—ఓరీ దురాచారా! కులనాశకా! వంశాట పితరులకు దారకా! నీ వెటు బ్రదికి వచ్చితివి? నాయాజ్ఞలేకయ బ్రహ్మ నీకుఁ జిరాయువు నిచ్చినవాఁడు కాఁబోలు? వానిఁబట్టి తెప్పించి నీ నొసట వ్రాసినవ్రాఁతఁ దుడిపించెద.

ప్రహ్లాదుఁడు-సీ. అజ్ఞానరోగుల కతి సుఖదఁపు దేవ
తార్క్ష్యవాహనుని పాదములసేవ
తాపత్రయాంబుధిఁ దరియింపఁ దగునావ
తార్క్ష్య వాహనుని పాదములసేవ
జీర్ణ జీవాళి సంజీవన పుందీవ
తార్క్ష్య వాహనుని పాదములసేవ
అతినియతినిఁ బూను యతులకు నెఱి తేవ
తార్క్ష్య వాహనుని పాదములసేవ
గీ. ఆర్తజనులకు నావటమైన క్రేవ
అంధులకునైన సులలితమైన త్రోవ
భవ్యగుణరత్నముల భద్రపఱచుత్రోవ
సారమగుచేవ శ్రీహరి చరణసేవ.

తండ్రీ! దేహాభిమానముఁ బెంచి, తత్సంబంధాధికారమున గర్వించి యస్థిరంబగు భుజబలంబున మించి కరకలిత కృపాణ భీకర లోకపాలకులను నాజ్ఞలో నిడితి ననుదురహంకారమున విజృంభింపకు. చతుర్దశ లోకంబులు సులలితముగఁ దన యుదరంబున నిడికొని రక్షించు హరి లోకాధికారి. వాఁడు నాకుఁ బ్రాణ

వాఁడు. బ్రహ్మ నానొసట వ్రాసినవ్రాఁతఁ దుడిపింప నోపుదువుగాని నాయాయువు క్షీణింపఁజేయు హరియొకఁడే సమర్థుఁడు. ఆ హరి నామమంత్రసారము నా శరీరమున వ్యాప్తమయి యుండ నన్నెవరేమి సేయఁగలరు ?

క. సారము రుచిసారము సం
సారము నాఁబరగు దుఃఖ సంతప్త ఘనా
సారము క్షామవినాశా
సారము హరిపాదతీర్థ సారముతండ్రీ.

అనుబంధము — 42.

హిరణ్య — ఓరీ దురాత్మా! క్రొవ్విక్రేలెదవు నోరుమూయుము. (రాక్షసులఁజూచి)
రాక్షసులారా! వీనిం గొనిపోయి మత్తగజంబులచేఁ ద్రొక్కింపుడి.

రాక్షసులు — (ప్రహ్లాదునిఁ దోడ్కొనిపోదురు.)

ప్రహ్లాద:— అనుబంధము — 43.

(నిష్క్రమము.)



## అష్టమరంగము.



### అరణ్యము.

ప్రహ్లాదుఁడు, రాక్షసులు.

రాక్షసులు—(ప్రహ్లాదుని నిలిపి మదించిన యేనుఁగును దెత్తురు.)

ప్రహ్లాదుఁడు—

వృత్తము.* పతితపావన ప్రణతిపాలన పరమసద్గుణ శీలనా
సతతక్షేలస సదయాలోచన సకలవైరివినాశనా
శ్రితజనావత హితసుధీజన చిరవినోదన బోధనా! స్మృతి
శ్రుతివిభూషణ సుగతికారణ సుచరితామృత సేచనా.

రాక్షసులు—(ఏనుఁగునుఁ బ్రేరేపింప నది ఘీంకారారావమునవచ్చి ప్రహ్లాదుని సమీపించి క్రిందఁబడును.)

(నిష్క్రమణము.)



* ఇది 21 ఛందములో 7, 53, 144-వ పతితపావనమను నూతనవృత్తము నభనభనభర గణములు 6-12 యతులు.

# ప్రహ్లాద నాటకము.

## పంచమాంకము — ప్రథమరంగము.

### ఆస్థానము.

హిరణ్యకశిపుఁడు, అష్టదిక్పాలకులు, రాక్షసుఁడు, ప్రహ్లాదుఁడు లీలావతి, బ్రహ్మ, నారదుఁడు, నారశింహావతారము.

హిరణ్య—ఓరీ నీచదేవేంద్రా ? నిన్న నాఁడే చంపనైతిని కావున గర్వించి నా యాజ్ఞోల్లంఘన సలుప నీ వాహనములగు మేఘములను బంపి నా సేవకులు ప్రజ్వాలింపఁజేసిన కీలికీలలను జల్లార్చితివా ? నీకపుడే యింతగర్వము వచ్చెనా ?

ఇంద్రుఁడు—దేవా ! తాము కాలితోఁ జూపిన పనిని నేఁ దలతోఁ జేయ సాహసింతునే. అట్టి నేను తమయాజ్ఞకు విరుద్ధముగ నటింతునా ? తమయాజ్ఞ వార్తయే నాకుఁ దెలియదు. నా వాహనము లన నేమి ? సర్వముఁ దమ యధీనములు గావా ?

హిరణ్య—అయినను నీకు శిక్ష విధింపకతప్పదు. (రాక్షసునిఁజూచి)

రాక్షసా—వీనికి దినంబున భోజనం బిడకు. (అగ్నినిఁజూచి) ఓరీ అగ్నీ ! నాయాజ్ఞయుండినను వరుణునకు భయపడి నీవేల నీ తేజం బార్చికొంటివి.

అగ్ని—దేవా ! నేనెంత ప్రయత్నించినను నాయత్నము మీఱెను. వరుణుని బలంబు హెచ్చెను.

హిరణ్య—హా ! హా ! సమాధానముఁ జెప్పెదవా ? (రాక్షసునిఁజూచి) వీని వీఁపుపై వాత వేయుము. (వరుణునిఁజూచి) ఓరీ వరుణా ! నీవేల వర్షించి మంటలార్చితివి ?

వరుణుఁడు—దేవా ! ఇంద్రునివాహనంబులు గర్వించి నాకళేము మీఱినవి. నేవలదన్నను బోయి వర్షించినవి

హిరణ్య—నీవు రాజవయి యుండియు స్వతంత్రుఁడవు గావు కావున నిన్నుఁ బదభ్రష్టునిఁ జేసెద. (రాక్షసునిఁ జూచి) ఓరీ! గరుత్మంతునిఁ బట్టి తెమ్మని శంబరునిఁ బంపి యుంటినే? వాఁడేమాయెను?

రాక్షసు—దేవా! తాము శిక్షింతురని వెఱచి తన తాతయిన తమవైరిని నైగృతి నెక్కించికొని యెచటికో పరుగిడెనఁట మన శంబరుఁడు వానినిఁ దగులుకొని పోయినాఁడఁట.

హిరణ్య—హా! హా! ఆగరుడునకిప్పుడే యింతగర్వము వచ్చెనా? కాని (యమునిఁ జూచి) ఓరీ యమా? నాయాజ్ఞ శిరసావహించి ప్రహ్లాదుని ప్రాణంబు లేల దీయవైతివి.

యముఁడు—దేవా! తమ యానతిలేక జగతిని నుండెడి యొకప్రాణినైన బాధింపఁ గూడదని తమయాజ్ఞయయి యుండెను. కావున నేను వానినంట వెఱచితిని. దేవా! మఱియొకటి బ్రహ్మ ప్రతిమనుజుని ఫాలతలంబున నాయుః పరిమితి వ్రాసియుండును. దానిని నతఁడు తుడువకున్న నా యధికారంబు చెల్లదు.

హిరణ్య—ఓరీ బ్రహ్మ! నీవేల ప్రహ్లాదుని నొసట వ్రాలు దుడువనైతివి?

బ్రహ్మ—దేవా! నేను వ్రాసినవ్రాఁతఁ దుడుపను. మునుల శాపోక్తి నోపును గాని నావశము కాదు.

హిరణ్య—(రాక్షసులం జూచి) ఓరీ రాక్షసులారా! జగతిని నుండు మునులనందఱినిఁ బట్టికొనిరండు.

రాక్షసులు—చిత్తము.

(నిష్క్రమింతురు.)

(నారదుని ప్రవేశము.)

హిరణ్య—ఓరీ నారదా! నేను తపంబు సేయుతఱి నాదారకు నింద్రునుండి కలిగిన బాధ నీవు నివారించితివని యెంచి నిన్నేమియు ననక మన్నించుచుంటిని. నీ సహజబుద్ధి నీ వప్పుడే చూపినావు. పసిపిల్లకు నా విరోధి మతమును బోధించి వానిని నాకు ద్వేషిగ నొనరించినావు నీవు శిక్షార్హుఁడవు.

నారదుఁడు—దేవా! నీబాలుఁడు నా సరసనుండు తఱి నింక శబ్దోచ్చారణమే రాక యుండెను. అట్టివాఁడు నాబోధన వినునా? ఇంతయు సర్వలోకములు నరలీలగ జయించి సర్వాధికారివయిన నీపై నాకేమి మత్సరముండును.

(ప్రహ్లాదుని ప్రవేశము.)

గేయము. జగములు పోషించు ఘనుఁడు ప్రాపై
ఖగపతి వాహనుఁ డుండును మనకు
జగదేక దైవము హరియే ప్రాపై
నిగమాలయుఁ డుండు నిజముగ మనకు.

హిరణ్య—ఓరీ చండాలా! నీచా! నీకు నే నిడు బాధలన్నియును నీవు దప్పించుకొనుచున్నావు. ఈ మాయావి నారదుఁడు నీకేమో మంత్రము బోధించినాఁడు.

ప్రహ్లాదుఁడు—జనకా! నీకీ విభ్రాంతి యింకను వదలకయున్నది.

క. మంత్రముల ముఖ్యమంత్రము
తంత్రములో నెల్ల ముఖ్యతంత్రము వినుమా
యంత్రముల ముఖ్యయంత్రము
సంత్రాసులఁ బ్రోచు మంత్రసారము హరియే.

హిరణ్య—ఓరీ దురాత్మా! నే నితరుల మూలకమున నీ కొనరించిన మారణకర్మ నీవే దిమో యొక విధమునఁ దప్పించుకొనుచున్నావు. రాక్షసులు నీపై దయఁదలఁచి నిన్నుఁ జంపక యున్నవారు. ఇక నిన్ను వారిచేత నిడక నేనె చంపెద.

ప్రహ్లాదుఁడు - అనుబంధము — 44.

నాయనా! ఈమిథ్యావాదంబులఁ బ్రయోజనంబేమి? నీవు చంపువాఁడవు కావు. నేను జంపఁ బడువాఁడను గాను. సర్వ నియంత హరి సర్వాధికారి. అట్టి హరినామ మంత్రమును సదాకాలము పఠించువానికి ముక్తి సులభముగఁ గరత లామలకం బగును. జనకా! అట్టి మహామహిమాతిశయ ప్రభావ, రోచిష్ణుని విష్ణుని దూషించి యగాధ నరకకూపంబునఁ బడియెద వేల? వలదు. ఇంతకు నొకవేళ నీవే చంపువాఁడవని నీ కహంకృతి కలదేని నీవు చంపునది నాస్థూల శరీరము కదా? సూక్ష్మ దేహాంతరగతమగు నాత్మను నీవు చంపలేవుకదా? స్థూల

శరీర వియోగదుఃఖము, శారీరాభిమానముఁ గలవారికిఁ గాని తదితరులకు, నెన్నటికిని గాదు. జనకా! ఈ దేహంబు పంచేంద్రియా తురగబాధితమ్ము, ముఖ, చక్షు, కర్ణ నాసికాది నవద్వార వికారంబు, సత్వ రజస్తమో గుణాధీనంబు. జ్ఞానేంద్రియ శోభితమ్ము. కర్మేంద్రియ సంకలితంబు. పంచభూత ప్రపీడితమ్ము. బుద్ధి కామినీ మోహితంబు, ఇట్టి రుద్ధ విషయాధీన చేతనంబున, పురుషుండు పాలించుచుండును. పురుషుఁడే తద్వికారములకుఁ లోఁబడి, యంగనా సంగమ సంకలిత మోహాబద్ధుఁడై భామ భోగరతుఁడైనచో, నట్టివాఁడు పరమాత్మని స్వరూపముఁ గానక నీవలె నష్టస్మృతుఁడై పరిపరి దుఃఖభాజనుఁడయి పాపిష్ఠంబైన దశ, నంది, భూమినిఁ బలుమాఱు జన్మించుచుండును. తండ్రీ! ఈ యగపడు మనస్థూలదేహంబు, రథమ్మని యెన్నుము. పంచేంద్రియమ్ములు తురగమ్ములు మనంబను పగ్గముచేఁ గట్టఁబడియుండును. ఈ రథము నడపు సారథి బుద్ధి. ఆ సారథిపీఠము హృదయము. మనంబను పగ్గమును సారథి వదలెనేనిఁ బురుషుఁడను సేనాధిపతి మూఁడవస్థలయందును, నధ్యాత్మికాధి దైవికాధి భౌతికంబులను దుఃఖక్లేశంబు లనుభవించుచు, నీబలె నజ్ఞానాంధకారంబునఁ బడి దారిఁ గానక తారుచుండును. పురుషుఁడు సారథిని తన వశపఱచికొనక విచ్చలవిడి, విడిచెనేని, బుద్ధియను సారథి మానసమను పగ్గమును వదలివేయును. అట్టి యరాజకంబునఁ బంచేంద్రియములను గుఱ్ఱములు విమతము యిష్టానుసారము దిక్కొకటి యీడ్చుచు, సారథివశము మీఱి, సంసార దుర్గమాటవులంబడి, యహంకార మమకార బాధితుఁడై పరమపురుషుని నీవలె మఱచిపోవును. కావున మనుజుండు పంచేంద్రియములఁ బిగపట్టి సంసార వర్తగర్తంబునఁ బడక, విషయాదులకున్ జిక్కక, యహంకార మమకారములన్ వదలి సర్వకాలము జనస్థితి లయకారణుండును, పరమేశ్వరుండును నగుహరి, తన్నేలు దైవమని భజించుచు, సర్వజగంబులు సమస్త చరాచర కోటియుఁ దదాత్మకంబని తలంచి ఫలాపేక్షులు గాక, చిత్తశుద్ధికై, సకల కర్మంబు లాచరించువాఁడే ప్రపంచంబున ధన్యుఁడై యుండును. అదికష్ట సాధ్యమని మనుజుఁ డెంచనేని మఱియొక భక్తి యను సులభమార్గమ్మున హరినిఁ బొందనగు.

సీ. చర్చింప జనములీ జగతిని జపతప
స్స్వాధ్యాయ కర్మలు సలుపనేల ?
జననోపనయన దీక్షావ్రతంబులు మఱి
సవనాదికర్మలు సలుపనేల ?
వేదబోధితమగు వివిధోగ్ర కర్మలు
బలులంపటులు బూని సలుపనేల ?
వైవాహికోరు గర్భాధాన సీమంత
ములఁ జిక్కనగు కర్మ సలుపనేల
గీ. ఘోరసంసార వారాశి తారకమ్ము
సార శుభకర ధర్మ విస్తారకమ్ము
అతి ధృతి సమేత యతిచిత్త హంసకమ్ము
శ్రీయుతంబగు హరిమంత్ర నాయకమ్ము.

నారణ్య—(దూరమునకువచ్చి స్వగతము) ఏమీ ! నిన్న పుట్టి నేఁడు కన్నుఁదెఱచిన బాలున కింతటి మహాభక్తి యెటు కుదిరియుండును ? ఇదియేమో యచ్చెరువుగ నున్నది.

జలనిధిముంచితిఁ విశిఖ జాలము లన్బడఁ గ్రుచ్చితిఁ మదా
వళుల పదాహతిఁ బడఁగవైచితిఁ దక్షక దష్టుఁజేసితిఁ
గులగిరు లెక్కఁజేసి దిగఁ గూలఁగఁ ద్రోసితిఁ జిచ్చుఁజేర్చితిఁ
నిలిచెను వీఁడు ప్రాణమున; నివ్వెఱఁగయ్యెడు నేమి మాయమో.

(ఆలోచించి) వీఁడు గర్భముననుండిన తతినుండి యొక సంవత్సరము బాలుఁడగు నంత వరకుఁ బిచ్చి తలకెక్కిన పచ్చి ముసల సరసనుండెను. పుట్టినపుడే రాజతేజ ముగలిగి బుద్ధి కౌశల్యాతిశయమున మించినవాఁడు కావున వారి యున్మాదవాక్యములన్నియు విని నేర్చినాఁడు. బుద్ధి కుశలతకు సమాధాన మున్నది. వీఁడు నేనిడు, మరణోపాయములన్నియు నెటుల తప్పించుకొని మృత్యువు నెదిరించు

చున్నవాఁడో తెలియదు. ఇది పిచ్చి మునుల యైంద్రజాల విద్యయుండునా ? నిజముగ నావైరి ప్రభావముండునా ? ఎటులుండిన నుండనిమ్ము. మృత్యువునకు మృత్యువునైన నాకెవరినుండి యేమిభయము ? వీనిని జీవమున వదలితినేని దానవకులమునకే యపయశంబువచ్చును. లోకాధీశుఁడయి దైవమని పొగడికకనిన నా నిరంకుశాధికారంబునకుఁ గుందు కలుగును కావున వీనినిఁ జక్కఁగ విమర్శించి నావైరినిఁ జూపఁడేని సంహరించెద. ఒకవేళ నావైరినిఁ జూపెనేని వీనియెదుటనె వానినిఁ జంపి వీని పిచ్చిమతమునుఁ దొలఁగించెద. (ప్రహ్లాదుని వద్దకుఁబోయి గట్టిగఁ జేయిపట్టుకొని) ఓరీ చాండాలార్భకా! నీవు ధ్యానించు చాండాలుఁ డున్నవాఁడా ? ఉండిన నెచట నున్నవాఁడు ?

ప్రహ్లాదుఁడు—నాయనా! ఆ మహానుభావుఁడు నిత్యుఁడు కావున యున్నాఁడు. ఉండెను. ఉండును.

హిరణ్య—ఓరీ! వాఁ డుండినయెడల నెచట నున్నవాఁడు.

ప్రహ్లాదుఁడు—తండ్రీ! ఆ దేవదేవుఁడు సర్వాంతర్యామి కావున నన్నిస్థలములనుండును. చరాచర కోటియందెల్లెడ నుండును.

సీ. నరసురాసుర యక్ష గరుడ గంధర్వ కి
న్నర సిద్ధ సాధ్యా పన్నగములందు
యమ వరుణేశాన యమి ధన దానల
భూత రుద్రాదిత్య ప్రేతలందు
గజగండ భేరుండ వయ కంఠీరవ
సారంగ శార్దూల చయమునందు
ఆ చరాచరముల నస్త్ర వస్త్రాదుల
నఖిలాండకోటి బ్రహ్మాండమందు

గీ. వేయిమాటలఁ కేల యా వేదవేద్యుఁ
డఖిలుఁడయి యచ్యుతుండయి యప్రమేయుఁ

జగమున నీయందు నాయందు నఖిలలోక
ములనుండును నిత్యుండై యసురనాథా.

హిరణ్య—(కనుబెట్టుఁ జేసికొని) ఓరీ యున్నాఁడా! వానినిఁ జూపెదవా?
ప్రహ్లాద—చూపెదను.
హిరణ్య—ఇచ్చటఁ జూపెదవా?
ప్రహ్లాద—చూపెదను.
హిరణ్య—ఈభవనమునఁ జూపెదవా?
ప్రహ్లాద—చూపెదను.
హిరణ్య—ఈ స్తంభమునఁ జూపెదవా?
ప్రహ్లాద—నన్నేల ప్రుచ్చిప్రుచ్చి ప్రశ్నించెదవు? ఆదేవదేవుండు సర్వాంతర్యామి కావున నంతట నుండునని పలికితిని. వేయేల.

క. అంభోరాశిని నుండును
కుంభినియందుండు గగనగోళమునందున్
జంభారి వరదుఁడుండును
స్తంభంబున నుండుటరుదె? జనకా వినుమా!

హిరణ్య—ఓరీ! నిజముగ నీ స్తంభంబున నున్నవాఁడా?
ప్రహ్లాదు—ఉన్నాఁడు.
హిరణ్య—సత్యమా?
ప్రహ్లాదుఁడు—నీవిచట నీదేహముననుండుట మిథ్యయగును గాని యా మహాపురుషుఁ డుండుట సత్యము. సత్యము, ముమ్మాటికి సత్యము.
హిరణ్య—(హిరణ్యకశిపుఁడు కోపమున హుంకరించి కాళ్లతో స్తంభమును దన్నును. స్తంభము పగిలి నారసింహావతారంబున విష్ణు నవతరించి గర్జించును. ఆరూపమునుఁ జూచి హిరణ్యకశిపుఁడు వెఱచి దూరముగవచ్చి నిలిచి) "స్వగ" ఏమి యచ్చెరువిది? మూఁడులోకంబులు నా పేరువిని గుండెలు పగిలిఁ దల్లడిల్లు

చుండనే నీరూపమును వీక్షించినతోడనే భయమున నాదేహమెల్ల వడఁకు చున్నది. అవియేమి కారణమో. ఈ తేజోమూర్తినిఁ జూచిన క్షణముననే నా సత్వసారమెల్లను జాఱిపోయెను. నాకృపాణమే నాకు బరువుగఁ దోఁచుచున్నది. (ఆలోచించి) ఈమూర్తి రూపమును నే నెన్నఁడో చూచినటుల స్మృతికి వచ్చుచున్నది. అయినది కానిమ్ము. ఇన్నిదినంబులు వైరము సాధింపఁ బ్రల్లదంబులు పలుకుచు బాలుని హింసించుచు వైరి యగపడినప్పుడు పిఱికినైతినేని యపయశంబునకుఁ గారణంబగుదును. వీని నే గెలిచితినేని నేనేదైవ మగుదును. వీనితో నోడితినేని శాశ్వతసుఖంబుఁ గలుగు కావున వీనినిఁ బట్టికొన యత్నించెద. (సమీపించి.)

ప్రహ్లాదుఁడు—తండ్రీ! ఇప్పుడైన నీ తేజోమయ రూపంబుఁ జూడుము. నీ యవివేకము మానుము. అతులిత తపస్సమాధిని నియతాత్ములగు యతులకునైన నగోచరంబగు నీమూర్తి నీపూర్వభవార్జిత పుణ్యవశంబున నీకట్టెదుట సాక్షాత్కరించినాఁడు. హరివిద్వేష గాథ లింక మాని యీసరసీరుహలోచనుని చరణంబులు శరణంబులని యాశ్రయింపుము. నీదుష్కృతములెల్ల శుద్ధియయి ముక్తి సిద్ధంబగును.

హిరణ్య—ఓరీ! నీకుఁగాను వెదకివెదకి వేసరితి. వైకుంఠంబును జలగడిగితి. మున్నీటిలో మునిఁగి శోధించితి. పాతాళంబువఱకు భేదించితి. మునుల ననేకుల భేదించితి. నీవు దొంగవలె, నాయింటనే కంభమున డాఁగికొని యుండుట తెలియక పోయెను. ఇపు డేమాయెను. దొరకితివికదా? నినుఁబట్టి భేదించెద. (అనుచు నృసింహునిఁ బట్టికొని పడిపోవును. నృసింహమూర్తి యుగ్రంబున వాని యుదరంబుఁజీల్చి పేగులుతీసి తీసివేయును.)

(అష్టదిక్పాలకులు, బ్రహ్మ, నారదుఁడు, కేలుమోడ్చి.)

సీ. త్ర్యక్షర సంయుత తత్వాంతరస్థుఁడై
ప్రాపంచకము నిండు బ్రహ్మవీవ
ప్రథమ వర్ణాక్షర ప్రథముఁడై విలసిల్లి
జగతిని సృష్టించు స్రష్టవీవ

ప్రణవాఖ్య మందిర ప్రసాద ఖేలన
పరుఁడవై భాసిలు గురుఁడ వీవ
సత్త్వరజస్తమస్సంగతి నేకమై
యొక పరిభిన్నమై యొప్పు వీవ
గీ. దైవములలోన ప్రాముఖ్య దైవమీవ
నిగమ నిలయానురక్తుఁడై నెగడు వీవ
యవ్యయానంద రూపుఁడ వగుదు వీవ
పాహి నరసింహరూపనః పాహి దేవ.

(నృసింహమూర్తి యుగ్రుఁడై హుంకరించుచుండును)

బ్రహ్మ— అష్టదిక్పతులారా! ఈదివ్యమూర్తి కోపంబు రూపుఁ గొనినట్లు నగపడెను. ఈకోపంబు శాంతింపఁ జేయు యుపాయంబెద్దియో తోఁపకున్నది.

నారద— తాతా! విష్ణుభక్తాగ్రేసరుఁడగు ప్రహ్లాదుని ప్రార్థన యీ మహాదేవుని కోపం బుపశమింపఁ జేయునని నాకుఁ దోఁచెడు.

బ్రహ్మ— ప్రహ్లాదా! హరిభక్తాగ్రేసరుఁడయి మమ్ము నిర్భరాహ్లాద మగ్నులఁ జేసితివి. మున్ను నీతండ్రికి నే నిచ్చిన వరమ్ములు వమ్ముసేయక కేవల నరరూపముఁగాని కేవల మృగరూపమునుగాని ధరింపని చిత్రమగు నరసింహరూపమును దైవము ధరించులాగొనరించితివి. భవనమునఁ, బాహ్యప్రదేశమును గాని దేహళిప్రదేశమునఁ జేర్చి, పగలుగాని రాత్రిగాని గాని సంధ్యాసమయమునందు నార్ద్రశుష్కంబులుగాని నఖరాయుధములచే లోకకంటకుఁ డగు నీతండ్రినిఁ జీల్పించితివి. నావరమ్ము సార్థక పఱచితివి. ఇఁక నీదేవుని ప్రసన్నునిఁ జేయు భారంబు నీయది.

ప్రహ్లాదుఁడు— (దండప్రణామంబు లాచరించి కేలుమోడ్చి.)

అనుబంధము — 45.

(అనుచు, సాష్టాంగప్రణామంబు లాచరించును.)

నృసింహ— వత్సా! ప్రహ్లాదా! నీవు నా భక్తులలో ముఖ్యగణ్యుండవైతివి. నీతండ్రులు జంపఁబడిరే యని చింతిల్లకు. పూర్వజన్మంబున వారు నా దౌవారికులు.

మునిశాపగ్రస్తులై దానవ జన్మంబెత్తి నాతో ద్వేషించిరి. వారిని ఖండించి పవిత్రులంజేసితి. నీవు చిరాయువువై, నాభక్తి మఱవక నీతి యుక్తముగ రాజ్యంబేలుము. నీ యశం బాచంద్రార్కంబుగ నిల్చును. నే నదృశ్యుం డయ్యెద. (బ్రహ్మను జూచి) పుత్రా! నీ విడిన వరమ్ములు వ్యర్థమ్ముగా నీక పోషించితి. దిక్పాలుర చెఱఁ దప్పించితి. ఇఁక మీరు సురక్షితముగ నుండుఁడు.

(అందఱు నమస్కరింతురు.)

(నిష్క్రమము).

మంగళము.







# ఉత్తరరంగము.

## ప్రహ్లాదచరిత్రలోని వేదాంతార్థమును బోధించు ద్విపద.

ద్విపద. పురజనులార - యో పుణ్యాత్ములార
హరిభక్తవరుని - ప్రహ్లాదుని చరిత 2

వీనులవిందుగ - వింటిరి కాదె
యానందకరమయి - యమరెను గాదె ? 4

గురుతరవేదాంత - గూఢార్థ మిందు
నరసి చూచిన హృద్య - మగు నయ్యమీకు. 6

నిండుమనంబున - నెమ్మదినుండి
పండితవరులార - భావించి కనుడి. 8

ప్రళయాంతమున జలార్ణవ మెల్లనిండి
వెలసె నంచను నుడి - వేద్యము కాదె ? 10

ప్రారంభమున నేఱు ప్రాపంచసృష్టి
యారయఁగల్గుట - యారిదియె తెలియ ? 12

ప్రాణసంచయమెల్లఁ - బ్రారంభమునను
బోణిమిఁజెడి యెంతఁ - బొరలుచు నుండెఁ
గాలానుసరణినిఁ - గలసెనుగొన్ని
కాలక్రమంబునఁ - గలిగె రూపమ్ము.
అవతరించిన యట్టి - యా రూపమునకు
నవఁజేరిచిరి మత్స్యం - బందు జనులు.

* * * * *

మఱియుఁగములు గొన్ని - మాసినపిదప
మఱిగొన్ని యణువులు - మహితమై కూడి
నెఱిపడెఁ గూర్మమ్ము - నెఱిమీఱ జలధి
నఱమఱలేదిందు - నారయుఁడీవు.
ఆదిఁబుట్టిన మత్స్య - సర్గవబునసె
పాదునిల్చెను పేఱు - పాదుఁగానకను
రెండవరూపము - రెక్కొనె వారి
కాండమునందునుఁ - గార్యపియందు
వాసనాబలమున - వారిమందిరముఁ
బాసియుండఁగలేక - ప్రబలెను రెంట.

* * * * *

మఱిఁగొన్ని యుగములు - మాసినపిదప
మఱిఁగొన్ని యణువులు - మహితమై కూడి
వారాహరూపమై - వారాశివదలి
ధారణిఁజేరెనా - ధారవాసముగ
నయినను - విడఁజాల డయ్యెను వారి
మయవాసనను గాన - మహినిఁ గర్దమమె

మెచ్చుచునుంటకు - మితిగాలైనయ్యా!
నిచ్చయంబిడి మీరు - నెటి నమ్మఁడయ్యా.

* * * * *

మఱేఁ గొన్ని యుగములు - మాసినపిదప
మఱియుచు - సూక్ష్మాంశములు గొన్ని చేరి
నరకేసరులరూపు - నాటుఁగఁబుట్టె
ధరను వేదాంతార్థ - ధర్మంబయిద్ది.
ఇఁకమీరు పౌరాణి - కేతిహాసములు
సకలముఁజూచిన - సారాంశమిదియ.
ధర నృకేసరి - యాదిదైవమ్మ మనకు
నరయ శుద్ధజ్ఞాన - మది నారదాఖ్య
శుద్ధతత్వజ్ఞాన - సుఖలోలుఁడయ్యె
నిర్ధరఁబ్రహ్లాదుఁ డిది - కనుఁడయ్యా.
కలుషాంశకలితుండు - కనకకసిపుండు
మలినాంశములు జేర - మహిఁబుట్టె జడతఁ
దామసదేహ ప్రా - ధాన్యతఁగాన
తామసింపక చీల్చె - దైవము వాని
వివిధారిషడ్వర్గ - విషయబంధముల
తపులెల్లఁదెంచు - తత్వజ్ఞానిబలెను.
భవబంధములఁదెంచు - పథ మీచరిత్ర
భువిజనులకు నెల్ల - బోధించుఁగాదె ?
అజ్ఞానగుణచర్య - లన్నియుఁజూచి
ప్రాజ్ఞులువానిని - బాధించితెంచు

విధమును గాథఁగ – వివరించి రేమి
మధురభాషణముల – మాన్యులు మున్న

ప్రాణాణువుల శక్తిఁ – జూడ నల్పంబు
చాలదు సూక్ష్మంశే – జాలఁ మెదుర్పఁ

గావున నాహేమ – కశిపుఁడు చిక్కెఁ
శేషయొల్లనవిడి – శ్రీహరిచేత.

కలుష సంకలితమౌ – కనకంబుఁ వహ్ని
జ్వాలనంబులకుఁజిక్కి – చాయు హెచ్చైన
భంగిని దనుజుఁడు – పరమాత్మునకును
లొంగుచు వైకుంఠ – లోకముఁ జేరె.

పావనకరమగు – ప్రహ్లాదుచర్య
భావించువారికిఁ – శాపముఁదొలఁగు.

ప్రహ్లాదు గాధను – బఠియించువారి
కాహ్లాదమునుగల్గు – ననవరతంబు.

కావున జనులార – కాలకాలమున
భావించిచేయుఁడీ – ప్రహ్లాదు స్మరణ.

*  *  *  *  *

*  *  *  *  *



# (Appendix:)—అనుబంధము.

అ ను బ ం ధ ము — 1.

మాండురాగము - ఆదితాళము.

సూత్ర. శ్రీదేవా మహాదేవా భావమ్మున నిను సదా సంస్మరింతూ ॥ ప ॥
ఘనుని నిన్ను వనమునందు దినదినము నేమదిన్
నయభయములం వినుతులం జేతున్ గనునను కరుణన్ ॥ శ్రీ ॥ ౧ ॥
కాలకాలముల నిన్నున్ - కలువ హరా కృపం బ్రోవన్
వేడెదను నిరతము కనుకరుణన్
దురితహరా ధరణివరా భావమ్మున నిను సదా సంస్మరింతూ ॥ శ్రీ ॥ ౨ ॥

అ ను బ ం ధ ము — 2.

కమాజు రాగము - ఆదితాళము.

లక్ష్మి. మురవైరీ యిక లేవు మా
సురవారము మొరవినుమా ॥ మర ॥ పల్ల ॥
పోరామి విరాళి వడిగని
పొందుగాను యిక ॥ మర ॥ ౧ ॥

అ ను బ ం ధ ము — 3.

భాగే శ్రీరాగము - రూపకతాళము.

లీలావతి. కంటిని నే కాంతకలను - గంటిం జెఱగు లెన్నియో ॥ పల్లవి ॥
కానివానికేలం జిక్కి - కాంతిహీన నైతినీ ॥ అను ॥
దానివారి పట్టి నన్ను గారి యలం బెట్టెనయ్యో
దారిగానక కీడ్పడి కాంతారముల దాటితినే ॥ కంటి ॥ ౧ ॥
కూళుడెవండో నన్నుంజేరి కొప్పుంబట్టి యీడ్చెనయ్యో
కూలనేను నేలంబడితి పాలుమాలితిం బలుగతుల ॥ కంటి ॥ ౨ ॥

### అనుబంధము — 4.

హిందుస్తాని తోడి రాగము - రూపక తాళము.

ఇంద్రుడు. దానవపతి కనులగనుచు ధన్యుడనైతి
మానినీ మానుదునే మహిమలసతినీ ॥ పల్ల ॥
నారిమణిన్ నాకపురిఁ జేరఁగాఁ బవిధారను
నీచెలి గర్భము దార్చికొంతు సంతసము ॥ దాన ॥ ౧ ॥

### అనుబంధము — 5.

కమాజురాగము - రూపకతాళము.

ఇంద్ర. వెళ్లుమనారి యిలువదలి కదలుమ ॥ పల్ల ॥
లీలా. మానినిగారా మలపుటలు వదలుమ ॥ పల్ల ॥
ఇంద్ర. చాలా చాలా వేళా యగు నిఁక తరలుమ ॥ వె ॥ ౧ ॥
లీలా. నీతిన్ ఖ్యాతిన్ రీతిన్ గాంచుము వదలుమ ॥ మా ॥ ౧ ॥
ఇంద్ర. మగువా యగునె తగవీ గతినీ.
మతిహీనత బల్కకునిఁక వెడలుమ ॥ వె ॥ ౨ ॥
లీలా. తగవా బిగువా మగువన్ చెఱపన్
మగవాడవె ఛీ వగలగు వదలుమ ॥ మా ॥ ౨ ॥
ఇంద్ర. కలికిరో వలదిఁక పలుకులు పలకన్ గలుగునె ఫలము కలతలచేతన్
వలదిదియేలా వనితరో మేలా
పోలనిచేతలు పోలునె నీకున్ సెలతరో వెళ్లుము వేగమెపద ॥ వెళ్లు ॥ 3 ॥
లీలా. పలుకులు ములుకులు పలువా పలుకకు
ఛలమున ఫలమెటు కలుగును హీనా
ప్రబలుఁడవైనా యబలపైనా
పోలునె కలుషము చాలుర వలదూ
సతి నిటుపట్టుట పాపముగద ॥ మా ॥ 3 ॥

### అనుబంధము — 6.

ఇంగ్లీషు నోటు రాగము - ఏకతాళము.

లీలా. ఛీ పాతకి పలువా ఘనత గనవా
చెడుగు లిటు పలుకకు ఛీ ఛీ ఛీ ॥ పల్ల ॥

వనితనునన్నుఁ బరగబట్టి యొసరును నీకుఁ ఘనకలుషమ్ము
కనమిది ఖలనిను వినిచెవ వినరా ॥ షీ ॥ ౧ ॥
పుట్టినబాలుఁ గట్టడివగుచుఁ నెట్టగ నీకుఁ పుట్టెనె బుద్ధి
కలుషము ఖలవిను వినిచెవ వినరా ॥ షీ ॥ ౨ ॥

అనుబంధము — 7.

మాలకంస్ రాగము – ఆదితాళము.

నారద. శరకేలీ దహిత ఖసారీ ॥ శ ॥ పల్ల ॥
జయతి భువితలే కరుణ విశాలీ
జయతి వరఫలీ శరదనశాలీ
రసలీ నసలీ లకవీశ కల
అళిలీల శ్రీకేలి మధుర వనమాలీ ॥ శర ॥ ౧ ।

అనుబంధము — 8.

గౌరీమనోహరి – రాగము ఝంపెతాళము.

నారద. ఖచరేశ కలుషమ్ము కనరా యుచితమ్మె నీకు ॥ పల్ల ॥
సుచరిత్ర సుదతినీ నొకంగ నగునెటూ ॥ అను ॥
పతిసేవ మఱవని పడతి యిది కానవే
సుతశీల సతినేల కలంప దలంపఁ గనఁ ॥ ఖచ ॥ ౧ ॥
గతినీకు గలదేర కలత మత మేమిరా
మతిహీన వలగురా మాని మీ మహిళనూ ॥ ఖచ ॥ ౨ ॥

(9-10, అనుబంధములు పొరబాటువలన 22-వ పుటలో ముద్రించినారు. అవి 21-వ పుటలో నారదుడు "నేనుమఁ పోయెద" అని ఈ రెండుపాటలలో నేదైనను నొక దానిని పాడిపోవును.)

అనుబంధము — 9.

మాండ్ రాగము – ఆదితాళము.

నారద. మురారీ శౌరి శ్రీహరి ధారధార బ్రోవుం ॥ శ్రీ ॥
నరహరి మధురిపు దాసుని బ్రోవుము
యదుకుల తిలకమ
గోపీకాప్రియా ధారధార ॥ ము రా ॥

అనుబంధము — 10.

భైరవి రాగము - రూపక తాళము.

నారద. తాపస లోకాళిస్తుత్య చరితుఁడా
పాపాళినాశ మహితుఁ డలఁతుఁడా ॥ పల్లవి ॥
పాతకవిరోధి వర్గ శోషణుఁడా
భూతఘూకాళి చరిత విభూషణుఁడా ॥ అ. ప. ॥
దానవజన దాననిత్య ప్రియమునిఁడా
మానితవర పుణ్యోదయుఁడా
జ్ఞాని వ్యాప్తమందిర పరిచయుఁడా
భూనుత పావన పుణ్యానయుఁడా
విజ్ఞాన రుచిరోదయ విమల దేహుఁడా
వీత కామ మోహుఁడా
విగత పాప గేహుఁడా
పృథులోత్సాహుఁడా ॥ తా ॥ ౧ ॥

అనుబంధము — 11.

ఇంగ్లీషు నోటు రాగము - ఏకతాళము.

హిరణ్య. ధన్యుఁడ మాన్యుఁడ నైతినిని ధరణిని నెగడెడ దైవముగా
సురవరులన్ హరిహరులన్ పరిపరివిధముల బరిమార్తున్ ॥ ధన్య ॥ పల్ల ॥
భూరి శూరతను నేనూ గారించెద త్రిజగముల్లెల్లన్ ॥ ధన్య ॥ ౧ ॥
ఘనమునులన్ వననిధులన్ వనరఁగ ముంచెద బరమార్తిన్ ॥ ధన్య ॥ ౨ ॥
మేనుబాయ యతులెల్ల నానావిధముల గవలింతున్ ॥ ధన్య ॥ 3 ॥

అనుబంధము — 12.

మాలకంస్ రాగము - త్రిశ్రగతి తాళము.

హిరణ్య. ఏవ్వాఁడునూ ఏవ్వాఁడునూ
అవ్వారిగాను మాటలాడి కూయుచున్న వారినిన్ ॥ పల్ల ॥
వానిన్ వారధిన్ గూల్చెదన్ జీల్చెదన్ ॥ ఏవ్వా ॥ ౧
మౌనులన్ గానులన్ మానకన్ చంపెదన్ ॥ ఏవ్వా ॥ ౨ ॥
కర్మలన్ గిర్మలన్ కలఁచెదన్ దోలఁచెదన్ ॥ ఏవ్వా ॥ 3

అనుబంధము — 13.

తోడిరాగము - చాపుతాళము.

నారద. ఏందు డాగినాడో, యోహరి తా నెందు డాగినాడో ॥ పల్ల ॥
ఏందును వెదకిన కనలేదు మురహరిని
గంధరమున మున్గెనో గాదే హరి ॥ ఏందు ॥ అనుపల్లవి ॥
మును నీవు తపము సలిపి దైవమై త
తనుహరించు నను మనమునందున భీతిని పడుచు
తనుహరించు నను మనమునందున భీతిని పడుచు
పాతాళనో కానలజేరి పొందగ జనెనో
కొండలలోపల డాగెనో కానడయ్యె హరి ॥ ఏందు ॥ ౧॥

అనుబంధము — 14

శంకరాభరణరాగము - త్రిశ్రగతితాళము.

హిరణ్య. ఔరా మాతాడుమింక ధరమున తరిగెద శిరము రక్షా రాత్మ ॥ పల్ల ॥
ధీరుండని నన్నెన్నక దేవేరిని బట్టితివి
శూరుండవై తి యౌరా రా ॥ ఔరా ॥ ౧ ॥
ఖలున్నిన్ నిన్నున్ గలతలఁబెట్టి కారించెద గనరా నేనిపుడే
సరభసమున నీశిరిన్ బట్టి సరవిని నాదగు పురినిన్ జేర్చెద ॥ ఔరా ॥ ౨॥

అనుబంధము — 15.

శంకరాభరణరాగము - త్రిశ్రగతితాళము.

హిరణ్య. (హిరణ్యకశిపు పై పాట నివ్వటకూడా పాడవలయు.)

అనుబంధము — 16.

బేగడరాగము - ఆదితాళము.

లీలావతి. రారా చిన్నెల నగవుల నాబాలా
సుగుణాలవాలా ॥ రారా ॥ పల్లవి ॥
సోముగోమును దోమువోముగల
కాముని బోలెడు కాంత శరీరా ॥ రారా ॥ ౧॥
సుందరకాయా అందెలు మ్రోయా
చిందులు ద్రొక్కుచు శీఘ్రము రారా ॥ రారా ॥ ౨ ॥
శ్రీనివాసుని చిత్తమందునా
చింతనజేయుచు గంతులు వేయుచు ॥ రారా ॥ ౩ ॥

## అనుబంధము — 17.

అఠాణారాగము - ఆదితాళము.

నారద. ఎచటవినిన నెందుఁగనిన నసురరాజే శుకథలు పొదలుచు ॥ పల్ల ॥
యశముహెచ్చి దిశలుఁజొచ్చి గ్రాలెచు
యశద్వృశముగ హృదినినొదవె మోదము ॥ అను ॥
దేవలోక మెల్లనిండి నెగడఁగ సురవరుఁడు దిగులూనఁగా
పరులనేల పలుకహరియె వెఱచిదాఁగె వార్ధి వడిఁగనూ ॥ ఎచ ॥ ౧ ॥
భూనభోంతరములుచు నీ భుజసాహస విభవములుచు
యెన్నను హృదయమందు ముదముగాంచినద యత
హితజనులను మనుపు దుడితికులవర ॥ ఎచ ॥ ౨ ॥

## అనుబంధము — 18

రాగము - తాళము.

నారద. దితికులపక్షా శ్రితజనరక్షా యతికులశిక్షా సేమమా ॥
నతసురనేతా నుతజనదాతా
శమితారీ నీకు సేమమా
రతిపతిరూపా వితతప్రతాపా
సతతకలాపా సేమమా
నతపరిపాలా నుతగుణజాలా
హితపరిపాలా భద్రమా ॥ ది ॥

## అనుబంధము — 19.

శంకరాభరణరాగము — ఆదితాళము.

ప్రహ్లాద. రారా శ్రీనివాసవినుతా రారా దివ్యనామచరితా ॥ రారా ॥ పల్ల ॥
నను కాపాడఁగ మనము నను హరి
యనూనముగ భజియింతును ॥ రారా ॥ ౧ ॥
హరినిచు దప్పగ గురువులఁ గానను
పరాత్పరా నీ చరణదాసుడను ॥ రారా ॥ ౨ ॥

## అనుబంధము — 20.

ఇంగ్లీషునోటు రాగము - ఏకతాళము.

ప్రహ్లాద. ఘనునీ హరిని ఘనతగ గాను
కనెదా మదినీ గురునిగ నేను ॥ ఘను ॥ పల్ల ॥
కదలుమ గాధా వినఁజెడుబోధా
ఫదిలము గాదా మదిహరిబోధా ॥ ఘను ॥ ౧ ॥

చదువులనెల్లా చదువఁగనేలా
మదిహరి సారమ్మదె గనచాలా ॥ ఘను ॥ ౨ ॥

అనుబంధము — 21.

శంకరాభరణ రాగము - ఆదితాళము.

ప్రహ్లాద. రారా శ్రీనివాస వినుతా రారా దివ్యనామ చరితా ॥ రారా ॥ పల్ల ॥
నను కాపాడఁగ మనమునను హరి
యనూనముగ భజియింతును ॥ రారా ॥ ౧ ॥
హరినిక దప్పఁగ గురువులఁ గానను
పర్వాతరా నీ చరణదాసుఁడను ॥ రారా ॥ ౨ ॥

అనుబంధము — 22.

ఆనందభైరవిరాగము - ఏకతాళము.

బడిపిల్లలు—1. వద్దప్ప పాఠము వద్దెవద్దప్పా అబ్బ ॥ పల్ల ॥
శిన్ని శిన్ని యచ్చరము లన్నిటిని మింగిమింగి
అన్నముద్ద మింగఁబోకున్న సంగతేకపోయె
ఉన్న సదువు యెట్లొపోయె కన్నుగ్రుడ్లు సీలిపోయె
మొన్న మొన్న పాణముపోయెను
పోయె పోయె పోయె పోయె ॥ వద్ద ॥ ౧

2. మంచిమంచి పిండివంట లన్నిటిని తినితిని
పొట్టనిండనీళ్లుతాగి కంటినిండ నిద్రపోయి
గోలిగుండులాడుచును మనసారఁగ పాడుచును
తప్ తుప్ అంచు నేను బంతులాటలాడెదను ॥ వద్ద ॥ ౨ ॥

3. సక్కఁగాను సద్దిబువ్వ మెక్కి మెక్కి మెక్కి మెక్కి
శక్కిలాలు నములుకొని వక్కలాకు లేసుకొని
గుఱ్ఱంపిల్లను బట్టుకొని యెక్కి యాటలాడుచును
టక్కుటిక్కు అంచు నేను నిక్కి నీల్గువాడ నిక ॥ వద్ద ॥ 3 ॥

అనుబంధము — 23.

హరికాంభోజిరాగము - ఆదితాళము.

ప్రహ్లాద. రా శ్రీనాథా యిదె నినుదలతుక మది
నిరతము శరణని పరమ పురుష రా ॥ శ్రీనా ॥
పాపకలభహారి పావన సులహారి
నిలువుమ శ్రీహరి నిరతము నినుసెరి
శ్రీవర అరమర వలదికరా ॥ శ్రీ ॥ ౧ ॥

శ్రీనివాస నతసేవధి ధీనిధి సేవకునిఁ నను బ్రోవారా ॥ శ్రీ ॥

అనుబంధము — 24.

ఝుంఝూటిరాగము - ఆదితాళము.

ప్రహ్లాద. మాధవా హరీ మనఃబునను నిను దలఁతూ ॥ మా ॥ పల్ల ॥
మదినెంతును మానితముగనూ ॥ మాధవ ॥ అను ॥
మానమూన కాపాడారా మనము ననుఁజేరా
మదినెన్న చుండెదఁ గనా ॥ మాధ ॥

అనుబంధము — 25.

కల్యాణిరాగము - రూపకతాళము.

ప్రహ్లాద. శక్తి భక్తాళి సదా మోదదా వరదా శ్రీ ॥ శ ॥
విశ్రుత సుగుణీభరణీ వీర గర్వహారిణీ
విశ్వరక్షణ విభ్రాంత నివారణ
పావన శుభోదయవర్తన పాతకావళీ కర్తన
పాలనయన పరివర్తన భాగ్యభర్త గృహావర్తన ॥ శ ॥

అనుబంధము — 26.

భీమపలాస్ రాగము - రూపకతాళము.

ప్రహ్లాద. గౌరీశాకంబరీ నుతభవాని ననుకరుణఁ గనుమకృత్తి ॥
హరునిరాణి అమృతవాణి ననుకరుణఁ గనుమకృత్తి ॥ గౌ ॥
కఠినహింసల భూసురవితతి నిరతము నను గలఁచి కలచి
ఇడుమలిడుచు నడచిడీని ననుకరుణఁ గనుమకృత్తి ॥ గౌ ॥

అనుబంధము — 27.

మాలకంస్ రాగము - ఆదితాళము,

ప్రహ్లాద. ధరధర జలధర ధామకరుచి ధర
దీనాధార జ్ఞానాధారా పటిమ ధరాధర ॥ ధరధర ॥
స్మృతిహిత సుచరిత రుచిసార మధురిపు
నాకాలోకా నీకా సుభా వరదయపాలనా ॥ ధరధర ॥

అనుబంధము — 28.

కాంభోజిరాగము - రూపకతాళము.

హిరణ్య. కటకట యిటుల హితములను గఱపుదురే
ఇటునీటిఁ మీరు పటుతరముగ బోధింతురె ॥ కట ॥
పట్టి మిమ్ము నేను ఖండింతును త్వరితముగ ॥ కట ॥

### అనుబంధము — 29.

హిందుస్తాని తోడి రాగము - ఆదితాళము.

హిరణ్య. పలుకకున్న క్రొవ్వా పసిబాలకా మేరామీఱ ॥ ప ॥
కండలు మెండై యుండదె నీ యిటు
దండించెద ఖండించెద కండలను చెక్కించెద ॥ ప ॥ ౧ ॥
దండిగ తిండితిని కండలచె గుండువడి
యుండుదువె దండించెద ఖండించెద కండలను ॥ ప ॥ ౨ ॥

### అనుబంధము — 30.

బేహాగు రాగము - త్రిశ్రగతితాళము.

హిరణ్య. ఓరిబుద్ధిజాడ్యా ! హరినామ మాని నినుగూల్తు ॥ ఓ ॥ ప ॥
కావరమెల్లను పోవగఁజేతును నీ వికఁ బల్కుకు నిజముగాను
పావకకీలలఁ బాడఱ చేసెద పాతకి పల్కుకు శోకతగ నీదిటు ॥ ఓరి ॥ ౧ ॥

### అనుబంధము — 31.

బేగడరాగము - ఆదితాళము.

లీలా. క్రూరమార్గము మేరయేర నాథా ॥ పల్ల ॥
ఘోరమార్గము దారిగాదు నాథా ॥ అను ॥
పసిబాలు వీనిబాధ లుంచుచు
గాసిఁ జేయనేమి వాసిగాంచు నాథా ॥ క్రూ ॥ ౧ ॥
పెంచి పెద్దఁజేసి సంతసించి నేఁడు
వంచతను వీని పంచతనుగాన ॥ క్రూ ॥ ౨ ॥
యెంచనౌనె శ్రీ మించు నేరనాథ
కాంచుమానసమున కరుణ ప్రాణనాథా ॥ క్రూ ॥ 3 ॥

### అనుబంధము — 32.

ఝంఝూటి రాగము - ఏకతాళము.

లీలా. కనికరమ్ముమాని యిడఁజాలనూ విషము ॥ క ॥
ప్రహ్లాద. మానవమ్మ హీనచింత బూననేలనే
అనూన ప్రేమనననన్ గనన్ శ్రీహరీ ॥ ౧ ॥
లీలా. తనయా విషంబేను యిడజాలను కనరా ॥ క ॥
ప్రహ్లాద. దానవారి బూని నన్ను తానుకాచును
మనమ్మునన్ ముదమ్మును గనవె జననీ ॥ ౨ ॥
లీలా. కనికరమ్ముమాని యిడఁజాలనూ విషము ॥

అనుబంధము — 33.

ఇంగ్లీషునోటు రాగము - త్రిశ్రగతి తాళము.

హిరణ్య. కుటిలాత్మవైతివె మాటనాసి మీఅడగునె మౌనమూనుచూ ॥ కు ॥
తాటకి నీనీటులా గిటడక చెడక
ఛీఛీటో మార్కాటో నాడకటో చనుకులటో జంపివేసెదక ॥ కుటి ॥ ౧ ॥

అనుబంధము — 34.

ముఖారి రాగము - ఆదితాళము.

ప్రహ్లాద. మదినిన్నూ నమ్మితి ముదాముగ నానే ॥ మ ॥ పల్ల ॥
వదలక నీసేవా వాసిగాఁ జేయూ ననూ
బాధ బాపానిసూ భక్తిని గొల్తు శౌరీ ॥ మది ॥ ౧ ॥
దానవేశుఁడుఁ తండ్రీ దయమానె నాపై
శ్రీనివాసుఁడ నీవు స్థిరముగ కావుమూ
మానసంబున నిన్ను మఱవను నాయానా
పూని ప్రోవుము నన్ను భోగితల్ప యీతరీ ॥ మ ॥ ౨ ॥

అనుబంధము — 35.

మాండ్ రాగము - ఆదితాళము.

ప్రహ్లాద. జలజనయన జలజవదన జలధిశయనరా
ఖలనికారణ రారా కలుషనాశన రారా కలసుభావణరా ॥ జ ॥ ౧ ॥
రమార్సరసా మానసా భూరిసాహాసా
అనూనవిలాస శ్రీనివాసా భూరిసాహాసా ॥ జల ॥ ౨ ॥

అనుబంధము — 36.

మాండ్ రాగము - ఆదితాళము.

ప్రహ్లాద. నారాయణ కేశవా మురారీ హారీ
మురారీ హారీ హారీ మురారీ హారీ ॥ నా ॥ పల్ల ॥
వారథీ తీరమునూ జేరితి నీదయను
వారిజనయన నీ కరుణగాంచుమూ ॥ నా ॥ ౧ ॥

అనుబంధము — 37.

ఆరభిరాగము - ఆదితాళము.

ప్రహ్లాద. నాగశయా కనుమదయా యేగతి నా కిగనయా
భోగివిషంబును దీయక భోగిశయా రావయ్యా ॥ నా ॥ ౧ ॥
ఎంతనినే నుతియింతూ యెంతనినే వర్ణింతు
చింతాబ్ధిక మునిగితి శ్రీకాంతా నీశరణంటీ ॥ నా ॥ ౨ ॥

అనుబంధము — 38.

హిందూస్తాని తోడి రాగము - యేకతాళము.

ప్రహ్లాద. శ్రీహరిదేవా వినుత విభవాయా వినుత విభవాయా ॥ పల్ల ॥
మాధవ కావర నన్ను శ్రీహరిదేవా ॥ అను ॥
హరినారాయణ భక్తపరాయణ
మాధవ కావరనన్ను శ్రీహరిదేవా ॥ ౧ ॥

అనుబంధము — 39.

కాపీరాగము - త్రిశ్రగతి తాళము.

హిరణ్య. హరిని దిక్కరి దొంగను యెందును గానరైతివే గదా
మందభాగ్యుడా ॥ హరి ॥ పల్ల ॥
వానిఁ భజింపఁగఁ కుటిలునిఁ కడిఁతేఁ జం కమానను నే
వైరిని స్మరియింప ప్రాణము దీయుదు మానుము నీవిక ॥ హరి ॥ ౧ ॥

అనుబంధము — 40.

పీలురాగము - ఆదితాళము.

ప్రహ్లాద. హరినితలంచెదా సదా మదినీ
మానముగా ననుఁ గాచున నీ తలచె
దీనులచూచుఁ దిటముగ గాచుఁ
మానుల బ్రోచుఁ మదమును ద్రోచుఁ ॥ తల ॥ ౧ ॥
నీరధినావా నిజముగు త్రోవా
భక్తుని కావా బరువేటుదేవా ॥ తల ॥ ౨ ॥

అనుబంధము — 41.

మాండ్ రాగము - త్రిశ్రగతితాళము.

ప్రహ్లాద. శ్రీహరి శౌరీ భూరి ముదామునిదూ వేడువాడ రారా
పరమాత్మ సర్వాత్మ ముదాము నిడు వేడువాడ రారా ॥ శ్రీ ॥ ౧ ॥
దీనుడను ధ్యానమునా వేయనే గానా
మానమదే నీదేను కాదా నీవాడనేను ధీరా బిరానరా
హృదయమునను పదయుగమును కుదురుగ నే
నే నింపున సేవించెద ॥ శ్రీహరి ॥ ౨ ॥

అనుబంధము — 42.

ఇంగ్లీషు నోటు రాగము - ఏకతాళము.

హిరణ్య. ఓరీ మరి మరి నీవాహరిని పొగడుచు పదరకు ఛీ ఛీ ఛీ
హరిని గిరిని జూపినవానిని తరిగెద శిరమును నేనిపుడే ॥ ఓ ॥ ౧ ॥

కరుణను వదలుచు నిన్నునే కరికిరి వితతికి నాహుతిజేతుఁ ॥ ఓరీ ॥ ౨॥

అనుబంధము — 43.

బేహాగు రాగము - ఏకతాళము.

ప్రహ్లాద. హరి నన్ను బ్రోవుమా వేగా హరివేగా ॥ పల్ల ॥
మనము నా నీపదా సేవా నేమరున నెంచుమా ॥ హరి ॥ ౧॥
శ్రీనివాసునీ శిష్యునికావా శీఘ్రముగరారా శ్రీహరివేగా ॥ హరి ॥ ౨॥

అనుబంధము — 44.

కాపీరాగము - ఏకతాళము.

ప్రహ్లాద. మానుతండ్రీ హీనమతముఁ మనమునందుఁ గనఁగనేలా ॥ మా ॥ పల్ల ॥
ఘనుని హరినీ జనక నీవు కనిన ముదముఁ గందువు
కనావేలా కలుషహరునీ గళితపరునీ శ్రీశుహరునీ ॥ మా ॥ ౧॥
నిగమరతు నీ సుగుణ హృదయు నిలయు యుతుని మానుచుఁ
విరోధించి నిలువ నగునా నిరయపథముఁ గాంచగానె ॥ మా ॥ ౨॥

అనుబంధము — 45.

కాపీరాగము - ఆదితాళము.

ప్రహ్లాద. నారసింహా రక్షింపుమా విమలపద కమలములకును
నతులు నుతులు సేతు దలతూ
అభినవ యశమును గాంచు స్వామీ
మనవీ కరుణా గనుమా వినుమా
విమలపదకముల మూలకూను
జగదాధారా నతకైవరా అఘసంహార
సదయ హృదయ అతి
ప్రణత నిరత మతి
జనన మరణగతి
నుత అమరపతి ॥ నారశింహా రక్షింపుమా ॥ ౧॥

సంపూర్ణము.



# తప్పొప్పుల పట్టిక.

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 1 | 10 | విజయ యులసు | విజ యులను |
| 2 | 1[illegible] | సృష్ట్యాదియంగు | సృష్ట్యాదియందు |
| ,, | 14 | మహిమాన్వ | మహిమాన్వ |
| ,, | 20 | వీరచట | కీరి చటు |
| 3 | 8 | కుపళిమంప | కుపళిమింప |
| ,, | 21 | సనందనుశాసింల్ | సనందనుల్ శాసిం |
| 4 | 4 | మహాలక్ష్మి | మహోలక్ష్మి |
| ,, | 16 | మటి | మట |
| ,, | 22 | వెన్నంటిరాదు | వెన్నంటరాదు |
| 5 | 2 | వెలుంగకున్నది | వెలుంగనున్నది |
| ,, | 6 | మూలకముప | మూలకమున |
| 7 | 8 | వినేకివి | వివేకివి |
| ,, | 15 | తెలుయునా | తెలియునా |
| 8 | 1 | పోయిని | పోయని |
| ,, | 15 | నగుపడ వీనిచేతఁ | నగుపడి వీనిచేతఁ |
| 9 | 18 | లేమ | లేఁడు |
| 10 | 18 | నొప్పృంప | నొప్పింప |
| 11 | 1 | జార్జించు | బార్జించు |
| ,, | 17 | శుఫముల్ | శుభముల్ |
| 15 | 2 | నామందిరజబున | నామందిరంబున |
| ,, | 14 | అనుఁ | అనుచుఁ |
| 15 | 15 | నీదె | నీదు |
| 17 | 23 | బుట్టినిది | బుట్టినది |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 18 | 16 | నీతగుఁ | నీరగు |
| 20 | 13 | మాయానుయ | మాయామయ |
| ,, | 19 | మృద్బాండ | మృద్భాండ |
| 21 | 1 | జఢత్వముఁ | జడత్వము |
| 21 | 2 | తజ్జఢాంశము | తజ్జడాంశము |
| ,, | 20 | డేలాకో | డేలకో |
| 22 | 12 | నొఁదించు | నొందించు |
| 23 | 7 | జనజరా | జననజరా |
| 24 | 13 | నన్నింటి | నన్నుంట |
| ,, | 16 | నఖిరాయుధ | నఖరాయుధ |
| 27 | 18 | యార్బాటములో | యార్భాటములో |
| 28 | 15 | వతెను | వలెను |
| 30 | 14 | హిరణ్యకసిపే | హిరణ్యకసివే |
| ,, | 19 | నమస్కరింపు | నమస్కరించు |
| 31 | 8 | దండిము | దండము |
| ,, | 13 | నాయింటిఁ | నాయింటఁ |
| ,, | 15 | నాయింటి | నాయింట |
| ,, | 21 | మధాంధతచే | మదాంధచే |
| 32 | 2 | రింరింపుము | రింపుము |
| ,, | 12 | గుంజెల్లు | గుంజిల్లు |
| 34 | 3 | జ్ఞాత | జ్ఞాతి |
| 35 | 25 | ఆయవాచ్యని | ఆయవాచ్యని |
| 37 | 13 | డపుడు | డపుడపుడు |
| ,, | 24 | ఏమిచేయుంటివి | ఏమిచేయుచుంటివి |
| 40 | 3 | నేర్పరి | నేర్పిరి |
| ,, | 6 | దురదృష్టి | దురదృష్ట |
| ,, | 7 | నేర్పరి | నేర్పిరి |
| 41 | 17 | హసావద | హసావధ |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 42 | 5 | దివ్యామద | దివ్యాపథ |
| ,, | 10 | అశ్వీవీ | అశ్వినీ |
| ,, | 20 | తఁడ్రీ | తఁద్రీ |
| 47 | 10 | నాఁను | నాను |
| 48 | 7 | గ్రహ్యాచితి | గ్రహించితి |
| 52 | 14 | పాడ | పాడు |
| 56 | 9 | యుండుఁడు | యుండును |
| ,, | 12 | కాఁతిని | కాఁతని |
| ,, | 17 | లుఁత్మను | లాత్మను |
| 57 | 18 | జ్ఞానవి | జ్ఞానివి |
| 61 | 14 | హారిస్మరణన | హారిస్మరణ |
| 63 | 10 | వెళ్లుకు | వెళ్లుఁడు |
| 66 | 16 | లకితసుభాస్పదంబని | లలితశుభాస్పదంబని |
| ,, | 18 | యుఁటి | యుంట |
| 67 | 17 | పెడఁదోవ | పెడత్రోవఁ |
| ,, | 24 | నిటుల | నటుల |
| 68 | 5 | సెలువిందు | సెలవిందు |
| ,, | 17 | నాసరసకుండు | నాసరసనుండు |
| 70 | 15 | వెలనిడి | వెలినిడి |
| ,, | 19 | జగంబు | త్రిజగంబు |
| 73 | 4 | మంత్రము | మంత్రమ్ము |
| ,, | 16 | యప | తాప |
| 74 | 23 | పతియే | పతియె |
| 76 | 1 | మెల్లని | నొల్లని |
| ,, | 9 | యననిట్టి | యనవట్లీ |
| 78 | 18 | యుండు | యుండె |
| 82 | 23 | పాలితలంబునఁ | పాలః |
| 84 | 6 | కుదారకా | కుతార |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| ,, | 13 | సజీవస | సంజీవన |
| 85 | 1 | వాఁడు | యున్న వాఁడు |
| 87 | 4 | నారశింహావతారము | నారసింహావతారము |
| 88 | 27 | నఃలీల | నఖలీల |
| 90 | 25 | ఆది | అవి |
| 91 | 19 | మాయమో | మాయయో |
| 92 | 6 | జూపఁడేసీ | జూపఁడేవి |
| ,, | 13 | సర్వాంతర్వామి | సర్వాంతర్యామి |
| ,, | 19 | వయ | గవయ |
| ,, | 23 | మాటలఁకేల | మాటలీఁకేలి |
| 93 | 13 | కుంభినియఁదుండు | కుంభినియందుండు |
| 94 | 2 | అవియేమి | అదియేమి |
| ,, | 24 | వర్ణాత్కుర | వర్ణాత్కుర |
| 95 | 8 | దేహా | దేహి |
| ,, | 9 | నృసిహామూర్తి | నృసింహామూర్తి |
| ,, | 11 | యుపాయంబెద్దియో | సుపాయంబెద్దియో |
| ,, | 17 | గేహాళి | దేహాళి |
| ,, | 19 | నఖిరా | నఖరా |



